# నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

## పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

**5** పండ్ల సువాసనలలో **13** మధురమైన బిళ్ళలు-
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122/PP tel

JAPAN MODEL

# వాయుదాలలా

ట్రాన్సిస్టర్



వాయుదాలలా ట్రాన్సిస్టర్ 3 బాండ్స్
ఆకర్షణీయ పోర్టబుల్ ట్రాన్సిస్టర్
ధర రు.165 వెలసంకి రు 5/-లు
న వాయుదాలలా ట్రాన్సిస్టర్లు
కు పంపగలము

PRICE 165/-

SOUND SALES (CTL)
ROOP NAGAR, DELHI-7

---




AMRUTANJAN
Pain Balm
*Amrutanjan Ltd.,*
14/15 Luz Church Road,
Madras-4

తలనొప్పి, జలుబులు, బెణుకులు, కండరాలనొప్పి — వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్నచోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.

అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది నొప్పులను. జలుబులను చప్పున,చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్

# అమృతాంజనం

## చప్పున పోగొడుతుంది!

AM-5981

# డబ్బు చెట్లమీద మొలిచి పెరగదు




డబ్బు సంపాదించడమునకు మీరు ఎంత కష్టపడ్డారో మీకు మాత్రమే తెలుస్తుంది. కనుక దానిని జాగ్రత్త పెట్టుకొని, దాని మీద డబ్బు సంపాదించాలి అనుకొంటారు. అలా చేయుటలో బ్యాంక్ ఆఫ్ బరోడా మీకు సహాయపడుతుంది.

**సేవింగ్స్ అక్కౌంటు.** దీనిని మీరు రు. 1/- అంత తక్కువ మొత్తములో ప్రారంభించ వచ్చును; మీకు ఇష్టము వచ్చినంత మొత్తమును డిపాజిట్ చేయవచ్చును. మీకు పూర్తి మొత్తము మీద వడ్డీ లభిస్తుంది. రు. 10,000/- వరకు ముందుగా నోటీసు అక్కర లేకుండానే ఎప్పుడైనా తీసుకోవచ్చును.

**మైనర్స్ సేవింగ్స్ అక్కౌంటు.** దీనిని 10 ఏళ్ల పైబడిన పిల్లలు వారంతట వారే ప్రారంభించి, నిర్వహించుకోవచ్చును. 10 నుండి 18 ఏళ్ల మధ్య వయస్సుగల పిల్లలు గరిష్ట పరిమాణము రు. 50,000/- వరకు డిపాజిట్ చేయవచ్చును. 14 ఏళ్లు, అంతకు మించిన వారు అయితే పరిమితి లేదు.

బ్యాంకు డిపాజిట్ల మీద వడ్డీ రు. 3000/- వరకు రాబడి పన్నులో మినహాయింపు కలదు మరియు రు. 1,50,000/- వరకు బ్యాంకు డిపాజిట్ల మీద ఆస్తి పన్నుకు మినహాయింపు ఉంది. బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఒక సేవింగ్స్ అక్కౌంటును ప్రారంభించండి—మీ డబ్బు పెరుగుటలో సహాయపడండి!

సిరిసంపదలకు అక్షయ పాత్ర




## బ్యాంక్ ఆఫ్ బరోడా

హెడ్ ఆఫీస్: మాండ్వీ, బరోడా.
550 పైగా బ్రాంచీలతో భారతదేశములో దాదాపు ప్రతి స్టేటులోను సేవ చేస్తోంది.
ఇంకా: యు.కె., తూర్పు ఆఫ్రికా, మారిషస్, ఫిజీ ద్వీపములు మరియు గియానాలలో బ్రాంచీలు కలవు.

Shilpi-BOB 1A/71 tel

# పాపం యీ దంతం హత్యచేయబడింది!



మరీ దారుణంగా. కొంచెంకొంచెంగా విషం యిచ్చి చంపినట్లు. చిట్ట చివరి క్షణం దాకా, అంటే పన్ను ఊడి వచ్చేవేదాకా యీ ఘోరమైన సత్యం తెలియనేలేదు. తెలిసదేమిటంటే—తెలిసీ చేసిన అశ్రద్ధ అని. అటువంటి సరియైనదికాని టూత్‌బ్రష్‌తోనూ, టూత్‌పేస్ట్‌తోనూ పళ్ళను తోమటం.

మరి బినాకా ఫ్లోరైడ్ గనక తప్పకుండా ఎప్పుడూ వాడివున్నట్లయితే, యీ విషాద సంఘటన జరిగివుండేది కాదు, ఎందువల్లనంటే, బినాకా ఫ్లోరైడ్‌లోగల యస్‌ఎమ్‌ఎఫ్‌పి మూడు విధాలుగా పళ్ళల్లోని కంతల్నుంచీ దంతక్షయాన్నుంచీ రక్షిస్తుంది.



- పంటి ఎనామిల్‌ని గట్టిపరచటానికి
- నోటిలో తయారయ్యే ఏసిడ్ తయారు కాకుండానూ
- దంతక్షయాన్ని అరికట్టటానికి

మీ పళ్ళని హత్య చేయకండి
మీ పళ్ళని కాపాడుకోవటం కోసం

## బినాకా ఫ్లోరైడ్




C I B A Cosmetics

ULKA-CF-30-TEL



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

పాఠకులకు విన్నపము:

బాంగ్లాదేశపు శరణార్థుల వల్ల మన దేశం చాలా త్యాగాలకు లోను గావలసి వచ్చింది. వారిని పోషించుటకుగాను ప్రభుత్వం పత్రికల మీద రెండు పైసాలు ఎక్సయిజు సుంకం విధించింది. ఈ బాధ్యత దేశభక్తి గల పాఠకులు భరిస్తారని ఆశిస్తున్నాము. చందమామ జనవరి నెల నుంచి రెండు పైసలు పెంచుతున్నాము. పాఠకులు చందమామను 2 పైసలు ఎక్సయిజు పన్నుతోసహా 92 పైసలకు కొన ప్రార్థన.

సంపుటి 49 డిసెంబర్ '71 సంచిక 6



CHITRA




సంపూర్ణకుంభో న కరోతి శబ్దం; అర్ధో ఘటో ఘోష ముపైతి నూనం;
విద్వాన్ కులీనో న కరోతి గర్వం; గుణైర్విహీనా బహు జల్పయంతి. 1

[నిండు కుండ మోత చెయ్యదు, సగం నిండిన కుండ చాలా చప్పుడు చేస్తుంది. కులీనుడూ, విద్వాంసుడూ అయిన వాడికి గర్వం ఉండదు. గుణం లేనివారే తెగ వాగుతారు.]

శ్రుతి ర్విభిన్నా; స్మృతయశ్చ భిన్నా;
నైకో ముని ర్యస్య వచో ప్రమాణమ్;
ధర్మస్య తత్వం నిహితం గుహాయాం;
మహాజనో యేనగతః స పంథా... 2

[వేదాలలో తేడాలున్నాయి. స్మృతులలో తేడాలున్నాయి. ఏ ఒక ముని చెప్పినదీ కొట్టి పారెయ్యటానికి లేదు. (అందుచేత) ధర్మతత్వం తెలియరానిదిగా ఉన్నది. (కనుక) గొప్పవాళ్ళు వెళ్ళినదే దారి.]

న వేత్తి యో యస్య గుణప్రకర్షం
సతం సదా నిందతి; నాత్ర చిత్రమ్!
యథా కిరాతీ కరికుంభజాతాం
ముక్తాం పరిత్యజ్య బిభర్తి గుంజామ్.... 3

[ఒకరి గొప్ప గుణాలను గ్రహించ లేనివాడు వారిని ఎప్పుడూ నిందిస్తాడు. అందులో ఆశ్చర్యం లేదు. కిరాత స్త్రీ ఏనుగు కుంభస్థలంలోని ముత్యాలను వదిలేసి, గురివెంద పూసలు ధరిస్తుంది.]

వ్యత్యాసాలు



# మరీన్యాయం!

ఒకనాడు ఒక రైతు పొలం దున్నుకుంటూ ఉండగా అతనికి ఒక ముత్యం దొరికింది. అది చాలా ఖరీదైనదిగా కనబడింది. దాని వల్ల తనకు వేరే ప్రయోజనం ఏదీ లేదు గనక, దాన్ని రత్నాల వర్తకుడికి అమ్మ దామని రైతు పట్టణానికి వెళ్ళాడు.

రత్నాల వర్తకుడు ,ఆ ముత్యాన్ని పరీక్షించి, అది చాలా విలువైనదనీ, రెండు వందల వరహాలకు తాను కొనగలననీ అన్నాడు. దానికి అంత వెల ఉన్నందుకు రైతు ఆశ్చర్యపోయి, ముత్యాన్ని అమ్మటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. వర్తకుడు ముత్యాన్ని తీసుకుని డబ్బు ఇచ్చాడు. వర్తకుడి న్యాయబుద్ధిని తనలో మెచ్చుకుంటూ రైతు తన గ్రామానికి తిరుగు ప్రయాణమయాడు.

రైతు నగరం దాటి కొంతదూరం వెళ్ళేసరికల్లా ఇద్దరు ముసుగు దొంగలు ఎటునుంచో వచ్చి రైతు పైన పడి, అతని వద్ద ఉన్న రెండువందల వరహాలూ లాగేసుకుని, పారిపోయారు.

రైతు పట్టణానికి తిరిగి వచ్చి, న్యాయాధికారిని కలుసుకుని, జరిగినదంతా చెప్పాడు.

న్యాయాధికారికి, రైతును దొంగలు దోచుకోవటం కన్న, రత్నాల వర్తకుడి ప్రవర్తనే విచిత్రంగా కనబడింది. ఎంత మంచి ముత్యమైనా రెండువందల వరహాల కంటె ఎక్కువ ధర చెయ్యదు. రైతు అమ్మినది అపురూపమైన ముత్యమే అనుకున్నా, వర్తకం చేసుకునేవాడు దాని పూర్తి ధర ఎందుకిచ్చాడు? పోనీ, రైతు రత్ననిపుణుడైనా కాడు. అలాటి వాడి దగ్గర ఏదన్నా కొనేటప్పుడు వర్తకులు ఏ నాలుగో వంతు ధరో ఇస్తారు. మరీ న్యాయపరులైతే సగం ధర ఇవ్వవచ్చు. కాని పూర్తి ధర ఇవ్వటం విడ్డూరం.

టి. యస్. మోహన్

ఆ వర్తకుడి నిజాయితీని పరీక్షించాలని న్యాయాధికారికి తోచింది. ఆ పరీక్షతోబాటే దొంగలను పట్టుకునే ఏర్పాట్లు కూడా ఆయన చేశాడు.

రైతును నాలుగు రోజులు తాళి రమ్మని పంపేసి, ఆయన సామాన్యుడి దుస్తులు ధరించి రత్నాల వర్తకుడి వద్దకు వెళ్ళి, "అయ్యా, మాది ఫలాని దిక్కుగా ఉన్న ఫలానా గ్రామం. మా వూరి జమీందారు గారికి ఒక ఉంగరం చేయిస్తున్నాను. అందులో పొదగటానికి మేలైన ముత్యం ఉంటే చూపండి. ఖరీదు ఎంత అయినా ఫరవా లేదు," అన్నాడు.

వర్తకుడు వెంటనే, రైతు వద్ద కొన్న ముత్యాన్ని తీసి, "బాబుగారూ, నిన్ననే దీన్ని నేను ఒకరి దగ్గిర రెండు వందల వరహాలకు కొన్నాను. పాతిక వరహాలు లాభం వేసుకుని దీన్ని మీకు అమ్ముతాను," అన్నాడు.

ఇప్పుడు వర్తకుడి నిజాయితీ గురించి సందేహమే లేదు!

"నేను బేరం చేసే వ్యవధి లేదు. వెంటనే మా గ్రామానికి వెళ్ళి, కమసాలికి ఈ ముత్యం ఇవ్వాలి," అంటూ న్యాయాధికారి వర్తకుడికి డబ్బు ఇచ్చి, తాను చెప్పిన గ్రామంవేపే బయలుదేరాడు.

ఆయన ఊహించినట్టే, నగరం దాటి కొద్ది దూరం వెళ్ళగానే ఇద్దరు ముసుగు దొంగలు ఎక్కడినుంచో వచ్చి, ఆయన పైన పడి, ఆయన వద్ద ఉన్న ముత్యాన్ని లాక్కున్నారు.

కాని మరుక్షణమే గ్రామాధికారి భటులు వచ్చి వారిని పట్టుకుని, దొంగల ముసుగులు తీసేశారు. ఆ దొంగలు మరెవరూ కాదు— రత్నాల వర్తకుడూ, అతని ఇంట్లో పనిచేసే నౌకరూనూ.

రత్నాల వర్తకుడు వర్తకంలో మరీ అంత న్యాయంగా ఎందుకు ఉంటున్నాడో గ్రామాధికారికి అర్థమయింది. ఆయన రైతుకు రెండు వందల వరహాలూ వర్తకుడి చేత ఇప్పించి, వర్తకుడికి పదేళ్ళపాటు జైలుశిక్ష విధించాడు.





# నరపిశాచి

ఒక ఊళ్ళో కామాక్షి అనే ఒక పేద ఇల్లాలు ఉండేది. ఆమె భర్త చాలా పేదవాడు. వారి దరిద్రానికి తోడు తొమ్మిది మంది పిల్లలు. భార్యా భర్తలిద్దరూ ఊరి మీద బిచ్చం ఎత్తి, సంసారం ఈడుస్తూ, అర్ధాకలితో బతుకుతూ ఉండేవారు.

కామాక్షికి ఒక అక్క ఉండేది. ఆమె పేరు మీనాక్షి. ఆమె సంపన్నురాలు; గర్విష్ఠి; దారిద్ర్యంలో ఉన్న తన చెల్లెలినీ, ఆమె పిల్లలనూ పిలిచి, ఒక్క పూట తిండి అయినా పెట్టిన పాపాన పోయేది కాదు. ఆమె కొంచెం దూరంలో వున్న మరొక గ్రామంలో ఉండేది.

మీనాక్షికి ఒక కూతురు ఉండేది. ఆమె ఒకసారి చెల్లెలి వద్దకు వచ్చి, "కామాక్షీ, నా కూతురికి పెళ్ళి చేస్తున్నాను. నువు వచ్చి కాస్త సహాయం చెయ్యాలి. నా కొంప మీదికి నీ పిల్లలనూ, మొగుణ్ణీ తెచ్చి నా పరువు తియ్యకు. నువు ఒక్కతెవే రా," అని చెప్పి వెళ్ళింది.

రేపు పెళ్ళి అనగా కామాక్షి తన అక్కగారి ఊరు బయలుదేరింది. ఇది చూసి పిల్లలందరూ మేమూ వస్తామంటూ ఆమె వెంటపడ్డారు.

"మీరు కూడా వస్తే పెద్దమ్మ మిమ్మల్ని తన్నేస్తుంది. నేను వచ్చేటప్పుడు మీ కందరికీ రకరకాల పిండి వంటలు తెస్తాగా!" అని కామాక్షి పిల్లల్ని సముదాయించి, అక్కగారింటికి వచ్చేసింది.

మీనాక్షి కామాక్షికి చాలా నిబంధనలు పెట్టింది. కామాక్షి పెళ్ళివారిని కలవరాదు. ఆమె పెళ్ళి పందిట్లోకి రాకూడదు. పదిమంది పంక్తినా భోజనం చెయ్యగూడదు.

నిజానికి మీనాక్షి తన చెల్లెల్ని పిలిచింది చాకిరీ చెయ్యటానికి. ఆమె బట్టలు ఉతికి ఆరేసింది, అంట్లు తోమింది, ఇల్లూ దొడ్డీ

అంబికా బండార్

ఊడ్చింది. పెళ్ళికి వచ్చినవారంతా ఆమెను చూసి పని మనిషి అనే అనుకున్నారు. ఏపూట కాపూట అందరి భోజనాలూ అయాక, విస్తళ్ళన్నీ ఎత్తి పారేసి, అందరూ తినగా మిగిలిన అడుగూ బొడుగూ తినేది కామాక్షి. ఆమె ప్రాణానికి అదే అమృతం లాగుండేది.

పెళ్ళి అడావుడి తగ్గినదాకా అడ్డమైన చాకిరీ చేసి, కామాక్షి తన ఇంటికి బయలు దేరుతూ, మూడు నాలుగు రోజులుగా నిలవ ఉన్న ఆహార పదార్థాలను ఒక గంపలో పెట్టుకున్నది.

మీనాక్షి చెల్లెలి నెత్తిన గంప చూసి, గబ గబా దగ్గిరకు వచ్చి, "ఏమిటే ఆ గంపలో?" అని అడిగింది.

"పాసిపోతున్న తిండి, అక్కా! నేను తినటానికేమన్నా తెస్తానని పిల్లలు ఆత్రంగా ఎదురు చూస్తుంటారు," అన్నది కామాక్షి దీనంగా.

"ఇంకా నయం! పాసి పోతుందని పారేసుకుంటారూ? గొడ్ల కుడితిలో వేస్తే అవి నిక్షేపంగా తింటాయి!" అంటూ మీనాక్షి గంప లాక్కుని, కుడితితొట్లో దిమ్మరించి, "ఇక వెళ్ళు!" అన్నది కామాక్షితో.

కామాక్షి హృదయంలో భరించరాని ఆవేదన బయలుదేరింది. తన అక్కకూతురి పెళ్ళి అయితే తన పిల్లలు తినటానికి ఏమీ తీసుకుపోకుండా వెళుతున్నది! ఇలాటి దారిద్ర్యంలో బతికేకన్న చావు మేలు, అనుకున్నదామె.



ఆమె నడిచి వెళ్ళుతుండగా కాలి కింద ఏదో మెత్తగా తగిలింది. ఆమె భయపడ లేదు. ఆమె వంగి చూస్తే, దారికి అడ్డంగా లావుపాటి పాము చచ్చి పడి ఉన్నది.

చావటానికి దేవుడు మార్గం చూపాడను కున్నది కామాక్షి. ఆమె ఆ పాము తలా, తోకా తీసేసి, మిగిలిన పాము శరీరాన్ని ముక్కలు ముక్కలుగా కోసి, గంపలో పెట్టుకుని ఇంటికి చేరుకున్నది.

పిల్లలు ఆమె చుట్టూ మూగి, "పెద్దమ్మ ఇంటి దగ్గిర్నుంచి ఏం తెచ్చావమ్మా?" అంటూ ఎగబడ్డారు.

"మీ కోసం మీ పెద్దమ్మ చేపలు ఇచ్చింది. అవి వండి మీకు పెడతాను," అన్నది కామాక్షి.

ఆమె పాము ముక్కల్ని ఒక కుండలో పోసి, నీళ్ళు పోసి పొయ్యి మీద పెట్టింది.

ఆమె తన భర్తతో, "నేను ఎవరి దగ్గి రన్నా ఇంత కారం ముష్టెత్తుకుని వస్తాను. కొంచెం ఆలశ్యం అవుతుందేమో. కుండ లోది కలుపుతూ ఉండండి." అని చెప్పి బయటికి వెళ్ళిపోయింది.

అతను కుండలో ముక్కలు కలుపు తుంటే, రాళ్ళు తిరుగుతున్నట్టు కటకట మని శబ్దం రాసాగింది. అతను ఆశ్చర్యపడి ఇంటి బయటికి పరిగెత్తి భార్యను కేకేసి వెనక్కు పిలిచాడు.




ఆమె తిరిగి వచ్చి, దీపం సహాయంతో కుండలోకి చూస్తే, బంగారు కణికలలాటివి తళతళమని మెరుస్తూ కనిపించాయి. వాటిని చూసి భార్యాభర్త లిద్దరూ దిగ్భ్రమ చెందారు. అప్పుడు కామాక్షి, వాస్తవంగా జరిగినదంతా భర్తకు చెప్పింది.

ఇద్దరూ కుండలో నుంచి ఒక కణిక ఖర్చుకు తీశారు. ఆ కణికను శెట్టి దగ్గిరికి తీసుకుపోతే దానికి తగ్గ డబ్బు ఇచ్చాడు. ఆ డబ్బుతో వాళ్ళు వంట పాత్రలూ, ఆహార పదార్థాలూ, అందరికీ బట్టలూ కొనుక్కు న్నారు. పిల్లలందరూ కొత్త బట్టలు కట్టు కుని, కడుపు నిండా తిని ఆ రాత్రి హాయిగా నిద్రపోయారు.

అకస్మాత్తుగా ఓచ్చగాళ్ళ బతుకు మెరుగు కావటం చూసి ఊళ్ళో వాళ్ళు ఆశ్చర్యపోయారు.

"ఈ మధ్య అక్కగారింటికి కామాక్షి వెళ్ళి వచ్చింది కదా, ఆవిడ బాగా సంపన్నురాలాయె, ఇంత ఇచ్చి ఉంటుంది!" అన్నారు కొందరు.

నిర్భాగ్యురాలైన తన చెల్లెలు సుఖంగా బతుకుతున్నట్టు విని, మీనాక్షి భరించరాని ఆవేదనపడి, చెల్లెలి ఊరికి పరిగెత్తుకుంటూ వచ్చి, అక్కడి న్యాయాధికారితో, "నా చెల్లెలు నా ఇంటి నుంచి ఏదో దొంగిలించుకుని వచ్చింది," అంటూ ఫిర్యాదు చేసింది.

న్యాయాధికారి కామాక్షిని పిలిపించాడు. అక్క చెల్లెళ్ళ తగాదా చూడటానికి ఊళ్ళో వాళ్ళంతా హాజరు అయారు.

కామాక్షి న్యాయాధికారికి జరిగినదంతా జరిగినట్టు చెప్పింది. న్యాయాధికారి ఆ కుండను ఉన్న పాళంగా తెమ్మని కామాక్షితో అన్నాడు. కామాక్షి ఇంటికిపోయి కుండను ఎత్తుకువచ్చి న్యాయాధికారి ముందు పెట్టింది.

"అమ్మా, దేవుడి మీద ప్రమాణం చేసి, ఈ కుండ నీదే అయితే, దీన్ని నిరభ్యంతరంగా నువు తీసుకు పోవచ్చు!" అన్నాడు న్యాయాధికారి, మీనాక్షితో.

మీనాక్షి ఆ కుండను పట్టుకుని ఎత్తింది. కుండలో నుంచి తాచుపాము తల బయట పెట్టి, బుస్సుమంటూ మీనాక్షిని కాటు వెయ్యబోయింది.

"అమ్మో!" అని చావు కేక పెట్టి మీనాక్షి కుండను వదిలేసింది. అది కింద పడి పగిలిపోయింది. బంగారు కణికలు బయట పడ్డాయి. పాము జాడ లేదు.

ఇది చూసిన వాళ్ళందరూ మీనాక్షిని "ఛీ, ఛీ!" అన్నారు.

కామాక్షి ఆ బంగారం ఏరుకునేటందుకు న్యాయాధికారి అనుమతించాడు. ఆమె ఆ బంగారాన్ని తీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది. తరవాత ఆమె, ఆమె భర్తా, పిల్లలూ సుఖంగా జీవించారు.





# రాకాసిలోయ

## 15

[ఖడ్గ జీవదత్తులు, రాజు నిత్యానందుడితో మాట్లాడుతూండగా, పూజారి రాకాసి ఏనుగుతో వచ్చి, ఖడ్గ జీవదత్తులను దగ్గిరకు పిలిచాడు. వాళ్ళిద్దరూ ఏనుగును సమీపించగానే, అది వాళ్ళను తొండంతో పడిసి పట్టుకున్నది. ఆటవికులు వాళ్ళను బంధించారు. నిత్యానందుడు తన సైనికులను, ఆటవికుల్ని ఎదుర్కొమని ఆజ్ఞాపించాడు. తరవాత—]

ఆటవికులు పెడబొబ్బలు పెడుతూ, ఈటెలూ, కత్తులూ పైకెత్తి తమకేసి రావటం చూస్తూనే, నిత్యానందుడి సైనికులు వెనుదిరిగి పారిపోసాగారు. రాజు చేసిన హెచ్చరికలేమీ వాళ్ళకు ధైర్యం కలిగించ లేదు. రాజు ఎక్కి వున్న రథాన్ని అంతకు ముందే వెనక్కు తిప్పి వుంచిన సారథి, తన ప్రభువు ఆజ్ఞ యివ్వకముందే, గుర్రాలను అదిలించి పట్టణం కేసి పరిగెత్తించసాగాడు.

"సారథీ, మనం పిరికిపందల్లా యుద్ధ రంగం నుంచి పారిపోయి వస్తున్నాం. ఇది విఘ్నేశ్వర పూజారికి మరింత ధైర్యాన్ని స్తుంది. వాడు మన నగరం మీదికే దాడి వచ్చినారావచ్చు," అన్నాడు నిత్యానందుడు.

సారథి ఓ క్షణకాలం మౌనంగా వూరు కుని, "మహారాజా! ఆ పూజారి దృష్టిలో మనం ఏనాడో చులకన అయిపోయాం. మనం పారిపోయిరాక అక్కడే నిలబడి



సాధించేదేమిటి? ప్రాణాలు పోగొట్టుకోవటమో, లేక వాడికి బందీలుగా దొరికి పోవటమో జరిగి వుండేది. దుస్సాహసం చేసిన ఆ ఇద్దరు క్షత్రియ యువకులూ ఏమయారో చూశారు గదా?'' అన్నాడు.

''అవును, పాపం! వాళ్ళు మన కోసం తెగించి పోరాడారు. ఎలాంటి వీరత్వం వాళ్ళది! అలాంటివాళ్ళు మన సైనికుల్లో ఒక్కడు కూడా లేడు. విఘ్నేశ్వర పూజారి బహుశా వాళ్ళను ప్రాణాలతో పదలడు,'' అంటూ నిత్యానందుడు తల తిప్పి చూశాడు.

ఆ సమయంలో ఆటవికులు, విఘ్నేశ్వర పూజారి ఎక్కి వున్న రాకాసి ఏనుగు మీద ఖడ్గ జీవదత్తులను తాళ్ళతో కాళ్ళూ చేతులూ బంధించి, వాళ్ళ ముఖాలకు నల్లని గుడ్డలు చుడుతున్నారు.

రాజు రథం మీద వుండి తన కేసి చూస్తున్న సమయంలోనే, విఘ్నేశ్వర పూజారి కూడా తల ఎత్తి అతడి కేసి చూశాడు. అతడి మనస్సు క్రోధంతో నిండి పోయింది. కళ్ళు నిప్పులు చెరిగాయి. ఈ రోజుతో తను రాజును పట్టుకుని చంపి, ఆనందపుర నగరం చేరి సింహాసనం ఎక్క గల ననుకున్నాడు విఘ్నేశ్వర పూజారి. కాని, ఆ ప్రయత్నం విఫలమైపోయింది.

''ఈ ఇద్దరు యువకులూ ఆఖరి నిమిషంలో మన పాలిటి సైంధవుల్లా పచ్చి అడ్డ పడి, ఆ నిత్యానందుడు మన చేతబడకుండా చేశారు. అయినా వీళ్ళను చంపకుండా, మన పక్షం చేసుకునే ఉపాయం ఆలోచించాలి. ఇద్దరూ మైకంలో వున్నారా, లేక ప్రాణాలు పదిలారా? కాస్త పరీక్షించి చూడండి!'' అన్నాడు విఘ్నేశ్వర పూజారి.

అతడు అలా అనగానే ఆటవికుల్లో కొంచెం వైద్యం అదీ నేర్చిన వాడొకడు, ఏనుగు మీదికి ఎక్కి, ముందు ఖడ్గ జీవదత్తుల ముక్కుల దగ్గిర వేళ్ళు పెట్టి చూసి, లాభం లేదన్నట్టుగా తలాడించి, తరవాత వాళ్ళ చేతులు పట్టుకుని నాడి పరీక్షించాడు. వాళ్ళింకా మరణించలేదన్న సూచనగా నాడి చాలా తగ్గుస్థాయిలో ఆడుతున్నది.

"పూజారిప్రభూ! వీళ్ళింకా చావలేదు. నాడి ఆడుతున్నది. మన చేత తిన్న దెబ్బలతో ప్రాణాలు కడబట్టి, స్పృహ మాత్రం కోల్పోయారు," అన్నాడు ఆటవికవైద్యుడు.

"అలా అయితే త్వరత్వరగా రండి. గుహాలయానికి చేరగానే, వీళ్ళ తిండీ తిప్పల సంగతి చూద్దాం. వీళ్ళు బతికుండి మన పక్షం అయితే, ఆనందపురంతోపాటు మరి కొన్ని రాజ్యాలను కూడా జయించవచ్చు. ఈ ఐరావతం జాతి ఏనుగు రహస్యం మరి అట్టే కాలం దాగటం కష్టం!" అన్నాడు విఘ్నేశ్వరపూజారి.

ఖడ్గ జీవదత్తులు నిజంగానే కొంత స్పృహ లేని స్థితిలో వున్నారు. వాళ్ళను బంధించి వున్న తాళ్ళు, శరీరానికి చాలా బాధ కలిగిస్తున్నవి. అంతేకాక ముఖం మీద కప్పి, గట్టిగా ముడివేసిన నల్లని వస్త్రంలో నుంచి గాలి పీల్చుకోవటం, వాళ్ళకు ఎంతో ఆయాసం కలిగిస్తున్నది. అయినా వాళ్ళకు విఘ్నేశ్వరపూజారి అనే మాటలు కొంత అస్పష్టంగానే అయినా, వినిపిస్తూనే వున్నవి.

ఒక అరగంట కాలంపాటు పూజారి ఎక్కి వున్న ఏనుగు, బాగా మిట్టపల్లాలుగా వున్న ప్రాంతాలకుండా నడిచి ఒక చోట ఆగింది. పూజారి ఏనుగు మీది నుంచి దిగి, ఆటవికులతో, "వీళ్ళిద్దర్నీ జాగ్రత్తగా దించి, గుహాలయంలో ఈశాన్యదిశగా వున్న



గదిలోకి తీసుకు పోయి, కట్లన్నీ విప్పేయండి. వీళ్ళకు నాలుగైదు రోజులకు సరిపడా ఆహారం, పానీయాలూ ఆ గదిలో వుంచండి. ఈ లోపల మనం సాధించవలసిన ఒక మహాకార్యం వున్నది!" అన్నాడు.

ఆటవికులు ఖడ్గ జీవదత్తులను ఏనుగు మీది నుంచి దించి, డోలీలాంటి దాని మీద పడుకోబెట్టి తీసుకుపోయి, పూజారి చెప్పిన గుహాలయంలోని గదిలో దించారు. తరవాత వాళ్లు, ఖడ్గ జీవదత్తుల ముఖాలకు కట్టిన వస్త్రాలు మాత్రం విప్పక, వాళ్ళ కట్లు మాత్రం విప్పి, ఆహారపదార్థాలు గదిలో ఒక మూలగా వుంచి బయిటికి వెళ్ళిపోయారు. అప్పటివరకూ ఏ మాత్రం



స్పృహలేని వాళ్ళలా నటించిన ఖడ్గ జీవ దత్తులు, ఆటవికుల అలికిడి పోగానే, తమ తమ ముఖాల మీద వున్న నల్లని వస్త్రాలను గబగబా విప్పి, అవతల పారేసి, లేచి కూర్చున్నారు.

గదిలో అంతగా వెలుగు లేదు. గదికి ఎక్కడా కిటికీలు గాని, తలుపుగాని వున్న సూచనలు లేవు. అయినా ఎక్కడి నుంచో సన్నగా గాలి వస్తున్నది. జీవదత్తుడు గ౹ అంతా ఓమారు కలయ చూసి, ఆశ్చర్యంగా తన కత్తి, విల్లుల కేసి చూసుకుంటున్న ఖడ్గవర్మతో, "ఖడ్గా, అంత ఆశ్చర్య మెందుకు? పూజారి మన ఆయుధాలేవీ అపహరించలేదు. కారణం తెలుసు గదా? మనను మంచి చేసుకుని, తన అనుచరులుగా అట్టే పెట్టుకోవాలన్నది, అతడి ప్రయత్నం!" అన్నాడు.

ఖడ్గవర్మ కోపంగా కత్తి పైకెత్తి, "ఆ దుష్టుడి ప్రయత్నం ఏదైతే నాకేం! నేను మాత్రం వాణ్ణి దొరికితే ప్రాణాలతో వదలను. వింధ్యపర్వతాల కేసి మన మానాన మనం పోతూంటే, అనవసరంగా అడ్డపడి, మనకు లేనిపోని శ్రమా, శరీర బాధా కలిగించాడు వాడు!" అన్నాడు.

"ఉష్! అంత పెద్దగా మాట్లాడకు. చీకటికి కళ్ళూ, గోడలకి చెవులూ వుండొచ్చు అంటారు పెద్దలు. ఈ గది వైశాల్య మెంతో, ఎక్కడైనా తలుపులూ, దర్వాజాల్లాంటివి వున్నవేమో ముందు నన్ను చూడనీ," అంటూ జీవదత్తుడు లేచి, రాతి గోడను తడువుతూ చుట్టూ ఓసారి కలయ తిరిగాడు. అతడి కెక్కడా గోడలో తలుపులు వున్నట్టు కనిపించలేదు. కాని, రాళ్ళల్లో వున్న సందుల నుంచి గాలి మాత్రం లోపలికి వస్తున్నది. అంటే, యీ గుహాలయంలోని యీ భాగాన్ని ఎవరో కేవలం రాతి మీద రాతిని పేర్చి, గోడలుగా పైకి లేపేశారు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ దగ్గిరకు తిరిగి వచ్చి, యీ సంగతే చెప్పి, "ఖడ్గా, మనకు ప్రస్తుతానికి పూజారివల్ల ప్రాణాపాయం లేదు. మనం ఏనుగు మీద వుండగా అతడు అటవి

కులతో అన్న మాటలు రెండు నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నవి!" అన్నాడు.

"వాడు తన బంట్లతో చాలా వాగాడు. నీ కాశ్చర్యం కలిగించే మాట లేమిటి?" అని ప్రశ్నించాడు ఖడ్గవర్మ.

"వాడు అన్న మాటల్లో, ఈ ఐరావతం జాతి ఏనుగు రహస్యం మరి అట్టేకాలం దాగటం కష్టం, అన్నదొకటీ; తాను రెండు మూడు రోజుల్లో ఏదో ఒక మహా కార్యాన్ని సాధించవలసి వున్నదనటం, రెండవదీ!" అన్నాడు జీవదత్తుడు.

"అయితే ఆ ఏనుగు ఐరావతం జాతిదై వుండాలి, లేకపోతే అసలది ఏనుగే కాదు! పోతే, వాడు సాధించబోయే మహా కార్యం ఏముంటుంది, ఆనందపుర సింహాసనం ఆక్రమించుకోవటం తప్ప!" అన్నాడు ఖడ్గవర్మ.

"ఖడ్గా, సరీగ్గా నీ కొచ్చిన అనుమానాలే నాకూ వచ్చినై. ఇవాల్టికి హాయిగా యిక్కడ విశ్రాంతి తీసుకుని రేపు సూర్యోదయంతోనే, మనం బయటపడి, యీ విఘ్నేశ్వరపూజారి అంతు తేలుద్దాం." అన్నాడు జీవదత్తుడు.

"అలాగే చేద్దాం. నాలుగైదు రోజులకు సరిపడా ఆహారం, పళ్ళూ, పానీయాలూ మనకు అమర్చాడు గదా, పూజారి. ఆహా, వాడెంత పుణ్యాత్ముడు!" అంటూ పెద్దగా నవ్వాడు ఖడ్గవర్మ.




ఆ పగలు గడిచిపోయింది. సూర్యాస్త మయమైపోయిందన్న సూచనగా ఖడ్గ జీవ దత్తులున్న గది మరింత గాఢాంధకారమై పోయింది. వాళ్ళు పూజారి నౌకర్లు పెట్టి పోయిన ప్రమిదె దీపాలను వెలిగించి, ఆ వెలుగులో భోజనాలు ముగించి, హాయిగా పడుకుని నిద్రపోయారు.

మర్నాటి ఉదయం గది బయట రేగిన పెద్ద అలికిడికి వాళ్ళిద్దరూ హఠాత్తుగా మేలుకున్నారు. ఆటవికులు పందల సంఖ్యలో ఒక చోట గుమిగూడి ఏదో మాట్టాడుకుంటున్నట్టుగా వాళ్ళున్న గదిలోకి ధ్వనులు రాసాగినై. ఖడ్గ జీవదత్తులు చెవులు రిక్కించి, వాళ్ళు మాట్టాడుకుంటున్న



దేమిటో వినాలని ప్రయత్నించారు. కాని, సాధ్యం కాలేదు.

"జీవా, విఘ్నేశ్వరపూజారి ఆటవిక మూకతో మళ్ళీ ఎక్కడికో దాడి బయలు దేరుతున్నట్టున్నది!" అన్నాడు ఖడ్గవర్మ.

"ఆ దాడి ఎక్కడికో అయి వుండదు, బహుశా వాడు నిత్యానందరాజును హతం చేసి సింహాసనం ఆక్రమించుకునేందుకు ఆనందపురం మీదికే బయలుదేరుతూండి వుంటాడు!" అన్నాడు జీవదత్తుడు.

"అలా అయితే మనం ఆ దుర్మార్గుడి బందీలుగా యిక్కడ చేతులు ముడుచు కుని కూర్చుండవలసిందేనా?" అన్నాడు ఖడ్గవర్మ.

"అలా ఎందుకూర్చుంటాం! ఆ ఆటవిక మూకతో వాడు బయలుదేరి పోగానే, మనం గది నుంచి బయటపడతాం. ఆ తరవాత పరిస్థితినిబట్టి ఏం చేయాలో ఆలోచిస్తాం," అన్నాడు జీవదత్తుడు.

"ఈ చీకటి కొట్టు నుంచి బయిటికి పోవటం అంత తేలికా ఏం?" అన్నాడు ఖడ్గవర్మ ఆశ్చర్యంగా.

"ఎందుకు్కాదు? చూస్తూ వుండు!" అంటూ జీవదత్తుడు గోడ దగ్గిరకు పోయి రాళ్ళ మధ్య వున్న సన్నని సందుల గుండా బయిటికి చూశాడు. అతడి కంటికి అయిదారు అడుగుల దూరంలో అలాంటిదే మరొక గోడ అడ్డుగా వుండటం కనిపించింది.

"రాళ్ళ మీద రాళ్ళు, గోడల పక్కన గోడలు—అదీ యీ గుహాలయం తీరు! అయినా ఫరవా లేదు. బయట ఆటవికుల హడావిడి తగ్గనీ, అప్పుడు చూద్దాం," అన్నాడు జీవదత్తుడు.

ఒక అరగంట తరవాత ఆ ప్రదేశమంతా తిరిగి నిశ్శబ్దమైపోయింది. జీవదత్తుడు మరి కొంచెం సేపు, ఏదైనా అలికిడి అవుతుందేమో అని చూసి, అలాంటిదేమీ లేక పోవటంతో ఖడ్గవర్మ కేసి తిరిగి, "ఖడ్గా, యీ గదిలోంచి బయిటికి పోయేందుకు మార్గం ఎక్కడున్నదో కనుక్కునేందుకు మనం అనవసరంగా శ్రమ పడటం

ఎందుకు? నిన్న సాయంకాలం మనను యిక్కడ వదిలిపోయిన వాళ్ళు, ఏ రహస్య మార్గాన వచ్చారో, వాళ్ళచేతే ఆ మార్గాన్ని తెరిపిద్దాం. నువ్వు మాత్రం ఆ వచ్చిన వాళ్ళను తప్పని సరైతే తప్ప లేకపోతే చంపకు!'' అని చెప్పాడు.

ఆ తరవాత జీవదత్తుడు గది అన్ని మూలలనూ కలయ తిరుగుతూ, పెద్దగా గొంతెత్తి, "విఘ్నేశ్వర పూజారీ! విఘ్నేశ్వర పూజారీ!'' అని కేకలు ప్రారంభించాడు. ఖడ్గవర్మ కూడా తన మిత్రుడితోపాటు మరింత బిగ్గరగా అరవసాగాడు.

ఒకటి రెండు నిమిషాల్లో గది గోడల్లో ఒక మూలగా వున్న నలుచదరపు రాయి ఒకటి పెద్దగా శబ్దం చేస్తూ పక్కకు జరిగింది. ఆ వెంటనే ఒక అటవికుడు గదిలోకి తొంగి చూస్తూ, "ఎందుకలా గోడలు అదిరేలా కేకలు వేస్తున్నారు?'' అని కోపంగా ఖడ్గ జీవదత్తులను ప్రశ్నించాడు.

జీవదత్తుడు ఎంతో ఆశ్చర్యపడుతున్న వాడిలా అటవికుడి కేసి ఓ క్షణకాలం చూసి, చప్పున మెరుపులా ఒక్క దూకున పోయి వాడి గొంతు పట్టుకుని, "పెనుగులాడావో గొంతు పిసికి చంపుతాను, జాగ్రత్త! ప్రాణం మీద ఆశ వుంటే నేనడిగే ప్రశ్నలకు చిన్నగా జవాబు లివ్వు. ముందు నువ్వు లోపలికి రా!'' అంటూ వాణ్ణి మెడ పట్టుకుని బరబరా లోపలికి యీడ్చి, గోడవాలున కూర్చొ బెట్టాడు.



అటవికుడు ప్రాణభయంతో గడగడ వణికి పోసాగాడు. జీవదత్తుడు భయపడ వద్దన్న సూచనగా అతడి భుజం తట్టి, "ఇంకా యీ గదికి కాపలా వాళ్ళెంత మంది వున్నారు?'' అని అడిగాడు.

"నేను కాక యింకొక్కడే! మిగతా వాళ్ళంతా పూజారి ప్రభువుతో కలిసి ఆనంద పురం మీదికి దాడి చేయబోయారు,'' అన్నాడు అటవికుడు.

"అలాగా! అయితే నువ్వు ఆ కంత దగ్గిరకు పోయి, ఆ రెండోవాణ్ణి కూడా భయం లేదని చెప్పి, లోపలికి పిలువు.

వాడికేమైనా హెచ్చరిక యిచ్చావే, నీ వెన్నులో కుండా నా మిత్రుడు కత్తి గుచ్చుతాడు!'' అన్నాడు జీవదత్తుడు.

ఆటవికుడు రాయి తొలిగించిన చోటుకు పోయి, బయిటికి తలపెట్టి, వాడి తోటికాపలా వాణ్ణి లోపలికి రమ్మని పిలిచాడు. ఈ సమయంలో ఖడ్గవర్మ తన కత్తిని ఆటవికుడి వీపుకు ఆనించి వుంచాడు. ఒక నిమిషం జరిగీ జరక్కముందే రెండవ కాపలావాడు కంతలోంచి గదిలోకి వచ్చాడు. అప్పటిగ్గాని వాడికి తన తోటివాడు బందీ లిద్దరి చేతుల్లో బందీగా వున్నాడని తెలియులేదు. వాడు చప్పున వెనుదిరిగి పారిపొబోయాడు. కాని ఖడ్గవర్మ వాడి భుజం పట్టుకుని గది మధ్యకు విసిరివేశాడు.

''ఇప్పుడు నిజం చెప్పండి. లేకపోతే మీ ఇద్దరి తలలూ యీ క్షణానే నరికేస్తాం. ఆ పూజారి వెంట మీ ఆటవికులంతా వెళ్ళారా, లేక కొంత మంది యీ గుహల్నీ, గుట్టల్నీ కాపలా కాస్తూ వున్నారా?'' అని అడిగాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ కత్తి పైకెత్తి ఆటవికుల తలలకు గురి చేసి నిలబడ్డాడు. ఆటవికులు గడగడ వణికిపోతూ, ''బాబూ, మమ్మల్ని చంపకండి. మా వాళ్ళంతా పూజారిప్రభువు వెంట ఆనందపురం కేసి వెళ్ళారు. మమ్మల్నిద్దర్ని మాత్రం మీకు కాపలాగా వదిలిపోయారు, నిజం!'' అన్నారు వాళ్ళు.

''అయితే, మీ ఇద్దరూ ఒక గంట కాలం యీ గదిలోనే వుండండి. మేము ఆ లోపలే తిరిగి వచ్చి, మిమ్మల్ని క్షేమంగా బయిటికి పంపుతాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఆటవికులు బతుకుజీవుడా అనుకుని ఖడ్గ జీవదత్తులకు చేతులు జోడించి నమస్కరించారు. తరవాత జీవదత్తుడూ, ఖడ్గవర్మా గది నుంచి బయిటికి పోయి, కంతకు ఎప్పటిలా రాయిని అడ్డం పెట్టారు. వాళ్ళు—దిగువనున్న మెట్ల మీదుగా కొంత దూరం నడిచి ఒక గుహలోకి పోయి, అక్కడ సోపానంలా వున్న మెట్లెక్కి కొండ పై భాగాన్ని చేరారు.

—(ఇంకా వుంది)






# సన్యాసి భార్య

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను నువు ఇలా కష్టానికి గురి చేసుకోవటం చూస్తే నీ విశ్వాసాలు సడలిపోయి, నీ మనస్సు చలిస్తుందేమోనని అనుమానంగా ఉన్నది. కష్టాల మూలంగా మనస్సు చలించిన కనకభద్రుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మహేశ్వరం అనే గ్రామంలో ఒక సామాన్య వ్యవసాయదారు ఉండేవాడు. అతనికి ఉన్నది కొద్ది పొలమే అయినా, అందులో నేర్పుగా వ్యవసాయం చేసి, మంచి ఫలసాయం తీసి, తన కుటుంబం సుఖంగా జీవించేటట్టు చూసుకునేవాడు.

## బేతాళ కథలు



అతనికి చాలాకాలం పిల్లలులేక, నడి వయసులో ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్ల వాడికి కనకభద్రు డని పేరు పెట్టుకుని, తల్లి దండ్రులు ఎంతో గారాబంగా పెంచారు.

కనకభద్రుడికి యుక్తవయసు రాగానే తండ్రి, "నాయనా, నువు పెళ్ళి చేసుకుని గృహస్థజీవితం లోకి అడుగుపెట్టు. యువ కులు మరీ ఆలస్యంగా పెళ్ళి చేసుకోవటం అంత మంచిది కాదు. నేనూ, మీ అమ్మా వార్థక్యంలో ప్రవేశించాము. మాకు నువు లేక లేక కలిగావు. నీ కడుపున పిల్లలు పుట్టుకొస్తే మేము మనమలనూ, మనమ రాళ్ళనూ చూసుకుని ఆనందిస్తాము," అన్నాడు.

కాని కనకభద్రుడు తండ్రి మాట వినక, "నాకు సంసారం మీద కోరికలేదు. నేను సన్యాసులలో చేరిపోయి, ఉత్తమ లోకాలకు దారి వెతుక్కుందా మనుకుంటున్నాను," అన్నాడు.

ముసలితనంలో కలగవలిసిన బుద్ధులు తమ కొడుక్కు యౌవనంలోనే కలగటం ముసలివాళ్ళకు వింతగా తోచింది. వాళ్ళు కనకభద్రుణ్ణి పెళ్ళాడమని రోజూ పోర సాగారు.

తల్లి దండ్రులు రోజూ తనను పెట్టే పోరు పడలేక కనకభద్రుడు కాశీకి వెళ్ళి, ఒక పెద్ద సన్యాసి వద్ద సన్యాసం పుచ్చుకుని, తత్వోపదేశం పొందసాగాడు.

కొద్ది సంవత్సరాలు కడిచాయి. మహే శ్వరం నుంచి వచ్చిన కొందరు యాత్రికులు కాశీలో కనకభద్రుణ్ణి కలుసుకుని, కొంత కాలం క్రితం అతని తండ్రి చనిపోయినట్టు చెప్పారు.

ఈ మాట వినగానే, ఒంటరిదైపోయిన తన ముసలి తల్లి గతి ఏమయిందోనని కనక భద్రుడు చాలా బాధపడ్డాడు. అతను తన గురువుతో, "స్వామీ, నేను ఒకసారి మా వూరు వెళ్ళి, మా అమ్మ ఎలా ఉన్నదో చూసి వస్తాను. మా తండ్రి పోయినట్టు తెలిసింది. సన్యాసం పుచ్చుకున్నాక తల్లిని చూడనే లేదు," అన్నాడు.

"వెర్రివాడా, సన్యాసికి తండ్రి ఎవరు, తల్లి ఎవరు? అంతా భ్రమ." అన్నాడు పెద్ద సన్యాసి.

"అలా కాదు, స్వామీ. నా తండ్రి మిగిల్చిన ధనం ఉంటే దాన్ని తెచ్చి, మన మఠానికి వినియోగిస్తాను," అన్నాడు కనక భద్రుడు.

పెద్ద సన్యాసి ఇందుకు సరేనన్నాడు.

మహేశ్వరం వేపుగా బయలుదేరుతున్న యాత్రికుల బృందం ఒకటి కనకభద్రుడికి తటస్థ పడింది. అతను వారితో కలిసి ప్రయాణం సాగించాడు.

నాలుగు మజిలులు గడిచాక ఈ యాత్రి కుల బృందాన్ని బందిపోటు దొంగలు దోచారు. దొంగలు కొందరిని చంపారు. కొందరు పారిపోయారు. పారిపోనివాళ్ళను దొంగలు పట్టుకుని, తమలోతాము పంచు కున్నారు. కనక భద్రుడూ, పార్వతి అనే ఒక ఆడమనిషీ ఒక దొంగ వంతు వచ్చారు. ఆ దొంగ వారిద్దరినీ తీసుకుపోయి, గంగా తీరాన ఉన్న తన ఇంటికి చేర్చి, వారిచేత తన ఇంటి పనులు చేయించసాగాడు.

దొంగకు కొన్ని ఆవు లున్నాయి. వాటిని కాచి, పోషణచేసే పని కనకభద్రుడిది. పార్వతి దొంగ ఇంట అన్ని పనులూ చేసేది. వారిద్దరూ అతని బానిసలు. వీరిద్దరిచేతా సంసారం చేయిస్తే, వీరికి కలిగే సంతానంతో తన బానిసల సంఖ్య పెరుగుతుందని దొంగకు ఒక ఆలోచన వచ్చింది. అందుకని అతను వారిద్దరి కోసం ఒక కుటీరం కట్టించి,





"అదివరకు మీరు ఏమవుతారో నాకు తెలీదు. ఇకనుంచీ మీరు భార్యా భర్తలు. ఈ కుటీరంలో మీరు మీ సంసారం ఏర్పాటు చేసుకోండి," అని పార్వతీ కనకభద్రులతో అన్నాడు.

ఇద్దరూ ఆ ఇంట అడుగు పెట్టగానే పార్వతి బెదిరిపోయింది. కనకభద్రుడు ఆమెతో, "నేను సమస్తమూ విడిచి పెట్టిన సన్యాసిని. అందుచేత నా నుంచి నీకు ఎలాటి భయమూ ఉండదు. మన యజమాని మాట జవదాటటం అపాయకరం. అందుచేత మనం పైకి భార్యా భర్తల లాగా నటిస్తూనే బ్రహ్మచర్యంలో జీవితం గడుపుదాం," అన్నాడు.

ఈ మాటతో పార్వతికి కనకభద్రుడంటే బెదురు పోవటమే గాక, అతని మీద భక్తి కూడా ఏర్పడింది. ఈ బానిస దశలో ఇద్దరూ ఒకరికి ఒకరు తోడుగా ఉంటూ, ఒకరి కష్ట సుఖాలు ఒకరికి చెప్పుకుంటూ, రాత్రి వేళ పురాణ కథలతోనూ, తత్వవిచారంతోనూ కాలం సుఖంగానే వెళ్ళబుచ్చారు.

వాళ్ళ యజమాని అయిన దొంగ వారు చేసే పనితో చాలా తృప్తిపడి, వారికి పూర్తి స్వేచ్ఛ ఇచ్చాడు.

కాని క్రమంగా కనకభద్రుడి మనసులో మార్పు రాసాగింది. అతను ఇలా అనుకున్నాడు:

"నేను సర్వసంగ పరిత్యాగిని. నాకు బానిసత్వమూ, స్వేచ్ఛా అన్న తేడా లేదు. కాని పార్వతి యోగ్యురాలు. కులీనురాలు. ఆమె తగిన భర్తను పెళ్ళాడి, సుఖంగా జీవించవలసిన స్థితిలో ఒక దొంగవాడి ఇంట బానిసగా బతకటం అనుచితం. ఆమె పైకి ఏమీ అనకపోయినా, ఈ జీవితం నుంచి విముక్తి పొందటానికి ఆమె మనస్సు పరితపించుతూ ఉండాలి. ఆమెకు స్వేచ్ఛ లభించే మార్గం ఏమిటి?"

ఆమెతో సహా తప్పించుకు పారిపోవటం తప్ప, ఎంత ఆలోచించినా కనకభద్రుడికి మరొక మార్గం కనబడలేదు. అతను ఒక రాత్రి పార్వతితో ఆ మాటే అన్నాడు.

"నాకు ఈ జీవితం దుర్భరంగానే ఉన్నది. కాని ఆడదాన్ని నా వల్ల ఏమవు తుంది? కావాలంటే మీరు తప్పించుకు పోయి, స్వేచ్ఛగా జీవించండి. నన్ను కూడా వెంట తీసుకుపోతే నేను మీ మెడకు గుది బండగా తయారు కావచ్చు," అన్నది పార్వతి.

"నేను తప్పించుకు పోదలచినది నీ కోసమే. అందుచేత నేను ఒక్కణ్ణే పారి పోయే సమస్య లేదు," అన్నాడు కనక భద్రుడు.

"అలా అయితే పారిపోయే మార్గం ఆలోచించండి. ఆ ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినా నాకేమీ అభ్యం తరం లేదు," అన్నది పార్వతి.

రాత్రి ఝాము పొద్దు పోయినది మొదలు తెల్లవారు ఝాము దాకా వారిద్దరిని గురించీ ఎవరూ పట్టించుకోరు. నది సమీపంలోనే ఉన్నది. పారిపోవటం ఏమంత కష్టం కాదు.

ఒక రోజు రాత్రి పార్వతి తనకూ, సన్న్యా సికీ నాలుగు రోజులపాటు సరిపోయే భోజన పదార్థాలు తయారు చేసింది. దాన్ని మూట గట్టుకుని, రెండు ఆవులను వెంట బెట్టు కుని, ఇద్దరూ నదికి వెళ్ళి, అర్ధరాత్రి లోపున ఆవుల సహాయంతో నది దాటి, కాలినడకన తెల్లవార్లూ నడిచి, తెల్లవారే సరికి ఒక నగరం చేరారు.



కనకభద్రుడు పార్వతి తన భార్య అని చెప్పి, ఆ రాత్రి దాకా ఒక సత్రంలో బస చేశాడు. అతను పార్వతిని ఎలాగైనా వారి స్వగ్రామం చేర్చాలనుకున్నాడు. కాని ఆమె ఎంతో ఆలోచించి కూడా తమగ్రామం ఏ ప్రాంతాల ఉన్నదీ అతడికి చెప్పలేక పోయింది.

"ఇప్పుడు మా ఇంటికి తిరిగి వెళ్ళినా నన్ను ఎవరూ చేరనివ్వరు. నేను దొంగ వద్ద బతికున్నన్నాళ్ళూ బానిసగా ఉండి పోవ టానికి సమాధానపడ్డాను కానా? మీకు అభ్యంతరం లేకపోతే మీ ఇంటనే చాకిరి చేస్తూ బతుకుతాను. మీ అమ్మగారు వృద్ధు రాలని అన్నారు గదా, ఆమెను చూసు

కుంటూ జీవితం వెళ్ళబుచ్చుతాను,'' అన్నది పార్వతి.

దారి వెంబడి మజిలీలు చేస్తూ కనకభద్రుడు పార్వతితో సహ కొంత కాలానికి మహేశ్వరం చేరి తన ఇంటికి వెళ్ళాడు. అతని తల్లి బొత్తిగా అపహాయురాలై నానా అగచాట్లూ పడుతున్నది. ఆమె కొడుకును చూసి బావురుమన్నది.

కనకభద్రుడు తల్లిని ఓదార్చి, "నువు కోడలి కోసం ఎంతో ఆరాటపడ్డావు గదా, నీకు కోడలిని తెచ్చాను చూడు,'' అంటూ పార్వతిని చూపాడు. పార్వతిని చూసి ముసలావిడ ఎంతో మురిసిపోయింది.

తరవాత కనకభద్రుడు ఇంటి పట్టునే ఉండి, పార్వతితో కాపరం చేస్తూ, తన ముసలి తల్లిని మరింత సంతోష పెట్టాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, కనకభద్రుడి వింత ప్రవర్తనకు అర్థమేమిటి? అతను చిన్న వయసులో సన్యాసం ఎందుకు పుచ్చుకున్నాడు? వైరాగ్యం కుదిరాక సంసారంలోకి ఎందుకు దిగాడు? ఈ అనుమానానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కనకభద్రుడి వైరాగ్యం జీవితానుభవం నుంచి వచ్చిన వైరాగ్యం కాదు. అతని తండ్రి కష్టజీవి. తాను సుఖజీవి. తన తండ్రి లాగా బతకటం అతనికి ఇష్టం లేక వైరాగ్యం తెచ్చుకున్నాడు. కాని తాను కూడా కష్టాలు పడటం మొదలు పెట్టినాక అతనికి జీవితం మరింత దగ్గిర అయింది. అతనికి తల్లి మీది మమకారం సహజమైనది, కాని పార్వతిని గురించిన ఆందోళన అనుభవం నుంచి ఏర్పడినది. స్త్రీ పురుషులు జీవితంలో భాగం పంచుకున్నాక దాంపత్య సంబంధం స్వాభావికంగా ఏర్పడుతుంది. కనకభద్రుడు ఇంటికి చేరే సమయానికి అతనిలో వైరాగ్యం ఏమీ మిగలలేదు. అందుచేత అతను సంసారంలో పడ్డాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహ మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అహంకారం అణగింది

అవంతీనగర ఆస్థానంలో హరనాథశాస్త్రి, గురునాథశాస్త్రి అని ఇద్దరు పండితులు ఉండే వారు. తమలాంటి తెలివి తేటలు గలవాళ్ళు ఎక్కడా లేరని వారికి వల్లమాలిన గర్వం. వాళ్ళు ఎప్పుడూ ఇతరులను అవహేళన చేసి, అవమానిస్తూ ఉండేవారు.

కళింగపుర ఆస్థానంలో సుగుణశర్మ అనే పండితుడు ఉండేవాడు. ఆయనకు గల పాండిత్యమూ, తెలివి తేటలూ అపారమైనవి. ఆయన ఖ్యాతి దేశదేశాలా పాకింది.

సుగుణశర్మను గురించి విన్న హరనాథ గురునాథశాస్త్రులు అతన్ని పరీక్షకు పెట్టి, ఓడించి, అవమానించాలనీ, అందువల్ల తమ ఖ్యాతి మరింత పెరుగుతుందనీ అనుకున్నారు.

వాళ్ళిద్దరూ తమ రాజుగారి అనుమతితో కళింగ చక్రవర్తి ఆస్థానానికి వచ్చి, "మహారాజా, మేము అవంతీనగర ఆస్థానపండితులము. తమ ఆస్థానంలో సుగుణశర్మ అనే పండితుడు ఉన్నాడట. ఆయనను జయించటానికి వచ్చాము," అన్నారు.

చక్రవర్తి అనుమతితో సుగుణశర్మ, "నేను పాండిత్యంలో అంత గొప్పవాణ్ణి కాను. అయినా మీరు కోరుతున్నారుగనక, మీ ఇద్దరినీ వేరు వేరుగా ఒక చిన్న ప్రశ్నవేసి పరీక్షిస్తాను. దానికి మీరు సరి అయిన సమాధానం ఇవ్వగలిగితే నాకన్న మీరు గొప్పవారని ఒప్పుకుంటాను," అన్నాడు. హరనాథ గురునాథులతో.

మర్నాడు సభలో పరీక్ష ఏర్పాటయింది. పరీక్షలో తమ ఆస్థానపండితుడు గెలుస్తాడో, ఓడుతాడో చూడాలని సభకు జనం గుంపులు గుంపులుగా వచ్చారు. సుగుణశర్మ ఒక రాతికి దారం కట్టి, దాన్ని ఒక కర్రకు వేళ్లాడగట్టాడు. ఆ రాతికే మరొక దారం కట్టి, దాన్ని కిందికి వేళ్ళాడనిచ్చాడు.

కాపుగంటి త్రినాథ విజయకుమారు

తరవాత హరనాథశాస్త్రిని సభలోకి రమ్మన్నారు. ఆయన వచ్చి సుగుణశర్మ పక్కనే కూర్చున్నాడు. అప్పుడాయనతో సుగుణశర్మ, "శాస్త్రిగారూ, ఈ రాతికి పైనా, కిందా దారాలున్నాయి గదా. నేనిప్పుడు కింది దారం పట్టుకుని లాగబోతున్నాను. లాగినప్పుడు కింది దారం తెగుతుందో, పై దారం తెగుతుందో చెప్పగలరా?" అన్నాడు.

"పై దారం తెగుతుంది," అని హరనాథుడు తడుపుకోకుండా చెప్పాడు.

సుగుణశర్మ కింది దారాన్ని పట్టుకుని విసురుగా లాగాడు. హరనాథుడు చెప్పినట్టు పై దారం తెగక, కింది దారమే తెగింది. హరనాథుడు ఆశ్చర్యపోయాడు.

"చూశారా? మీరు ఓడిపోయారు. మీరు వెళ్ళి గురునాథశాస్త్రిగారిని పంపండి. ఆయన్ని కూడా పరీక్షించి చూస్తాను," అన్నాడు సుగుణశర్మ.

హరనాథుడు, గురునాథుడి దగ్గిరికి వెళ్లి, జరిగినదంతా చెప్పి, "బాగా ఆలోచించకుండా పై దారం తెగుతుందని చెప్పి నేను ఓడిపోయాను. నువ్వయినా కింది దారం తెగుతుందని చెప్పి గెలిచి, మన పరువు నిలబెట్టు," అన్నాడు.

ఈ లోపల సుగుణశర్మ తెగిపోయిన దారాన్ని విప్పదీసి, రాతికి మరొక దారం కట్టి, కిందికి వేళ్ళాడేటట్టు చేశాడు.

గురునాథుడు సభలోకి వచ్చి, సుగుణశర్మ పక్కన కూర్చున్నాడు. హరనాథుని



అడిగినట్టే గురునాథుని కూడా సుగుణశర్మ అడిగాడు.

"కింది దారమే తెగుతుంది," అన్నాడు గురునాథుడు.

సుగుణశర్మ తనలో తాను నవ్వుకుని, కింది దారం పట్టుకుని నింపాదిగా లాగ సాగాడు. కొంత సేపటికి రాతికి పైన ఉన్న దారం తెగి, రాయి దభీమంటూ కింద పడిపోయింది.

రాజుగారితో పాటు సభలోని వారందరూ ఆశ్చర్యపోయారు.

సుగుణశర్మ గురునాథునితో, "ఇంత చిన్న విషయంలో మీరిద్దరూ ఓడిపోయారు. మీ పాండిత్యం సంగతి నాకు తెలీదు. మీరు గొప్ప పండితులే కావచ్చు. కాని మీకు విజ్ఞానం తక్కువ. అహంకారం హెచ్చు. అందుకే పిలవకుండా పెట్టకుండా ఎరగని వారిపైకి పోటీలకు వస్తున్నారు. ఇకముందు ఇలాంటి పనులు చేసి అవమానాల పాలు కాకండి," అని మెత్తగా చివాట్లు పెట్టి పంపేశాడు.

సుగుణశర్మ ఒకసారి కింది దారాన్నీ, ఒకసారి పై దారాన్నీ ఎలా తెంచాడో కళింగ చక్రవర్తికి అర్థం కాలేదు. దాని రహస్యం ఏమిటో చెప్పమని ఆయన సుగుణశర్మను అడిగాడు.

దానికి సుగుణశర్మ, "అది చాలా చిన్న చిటుకు, మహారాజా. ప్రతివస్తువుకూ ఒక విధమైన జడత్వం సహజంగా ఉంటుంది. మొదటిసారి నేను కింది దారాన్ని విసురుగా లాగాను. రాతిని మోసే దారానికి అదివరకే కొంత బిగువు ఉన్నప్పటికీ, నేను కింది దారాన్ని లాగటం చేత దాని బిగువు హెచ్చే లోపుగానే కింది దారం తెగిపోయింది. రెండో సారి కింది దారాన్ని నింపాదిగా లాగాను. కింది దారానికి తెగేటంత బిగువు వచ్చేలోపల, రాతిని మోస్తున్న పై దారం బిగువు తెగే దాకా పెరిగింది. దీన్ని ఎవరన్నా చేసి చూడవచ్చు." అన్నాడు.

రాజు సుగుణశర్మ యుక్తికి మెచ్చి, ఆస్థానం పరువుకాపాడి నందుకు ఆయనకు మంచి బహుమానం ఇచ్చాడు.



# పొదుపుకు కారణం

సుబ్బయ్యశెట్టి ఆస్తిపరుడు. పిసినిగొట్టుకాదు కాని, పొదుపరి.

ఒక రోజు అతని వద్దకు సూరయ్య అనే రైతు వచ్చి, పెద్ద పండుగ వస్తున్నదనీ, పాతిక రూపాయలు చేబదులు ఇవ్వమనీ అడిగాడు. సుబ్బయ్య ఇచ్చాడు.

ఆ సాయంకాలమే సుబ్బయ్య పండగకు తన భార్యకు చీరె కొందామని బట్టలదుకాణానికి వెళ్ళాడు. అక్కడ సూరయ్య పాతికరూపాయల వెల గల చీరె ఒకటి కొంటున్నాడు.

సుబ్బయ్య దుకాణం వాణ్ణి పది, పన్నెండు రూపాయల ధరలో చీరెలు చూపమన్నాడు.

సూరయ్య అది చూసి, "ఏమండీ, శెట్టిగారూ? డబ్బు గలవారు మీరు కూడా అంత చౌకలో చీరె కొంటున్నారేమిటి? రెట్టింపు ధర పెడితే ఎంతో మంచి చీరెలున్నాయి గదా?" అని కాస్త హేళనగా అన్నాడు.

"పొదుపు అవసరం, సూరయ్యా. లేకపోతే ఎవరన్నా వచ్చి ఓ పాతికరూపాయలు చేబదులు అడిగితే ఎక్కణ్ణుంచి తేగలను?" అన్నాడు సుబ్బయ్య.

—వసుంధర





# ఆశీర్వాదం

పూర్వం కాంచీపురంలో అరండాలు అనే భాగ్యవంతుడు ఉండేవాడు. కాకికి ఎంగిలి చెయ్యి విసరని పరమలోభి. గడపలోకి బిచ్చగాళ్ళు వస్తే కసిరి, వెళ్ళగొట్టేవాడు. అరండాలుకు గూని ఉండేది. అందుచేత అందరూ అతన్ని "గూని" అరండాలు అనేవారు.

అరండాలు ఇంటికి ఒక రోజు బిచ్చగాడు ఒకడు వచ్చి యాచించాడు. అరండాలు వాణ్ణి వెళ్ళిపొమ్మన్నాడు.

"అయ్యా, మూడురోజుల నుంచీ ఆకలితో మాడి చస్తున్నాను. ఇక నడిచే ఓపిక కూడా లేదు. పట్టెడు అన్నం పెట్టించండి," అన్నాడు బిచ్చగాడు.

అరండాలు బిచ్చగాణ్ణి కసిరి కొట్టి, తన నౌకర్లచేత అతణ్ణి అవతలికి గెంటించాడు.

బిచ్చగాడు ఆకలికి తాళలేక, గొణుక్కుంటూ, బడలికతో దారి పక్కన ఒక చోట కూర్చున్నాడు. వాడికి చాలా నిరాశ కలిగింది. అందుచేత దీర్ఘంగా నిట్టూర్పులు విడవసాగాడు.

గుడ్డి వాడొకడు ఆ దారినపోతూ, బిచ్చగాడి నిట్టూర్పులు విని, దగ్గిరికి వచ్చి, "ఎవరు, నాయనా, నువ్వు? ఎందు కలా పెద్దగా నిట్టూరుస్తున్నావు? ఏం జరిగిందేమిటి?" అని అడిగాడు.

"అయ్యా, నేను బిచ్చగాణ్ణి. ఎన్ని ఇళ్ళకు పోయినా పట్టెడు అన్నం దొరకలేదు. ఆకలితో చచ్చి పోతున్నాను. శోష వస్తున్నది," అన్నాడు బిచ్చగాడు.

"మా ఇంటికి రా. నాతోపాటు భోజనం చేదువుగాని," అని గుడ్డివాడు బిచ్చగాణ్ణి తన ఇంటికి తీసుకుపోయాడు.

గుడ్డివాడు తనకు కడుపునిండా పెట్టిన తిండి తిని బిచ్చగాడు పరమానందం చెంది, చేతు లెత్తి దణ్ణం పెట్టి, "భగవంతుడి అను

యస్. జహర

గ్రహం వల్ల నీకు మళ్ళీ చూపురావాలి!'' అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి గుడ్డివాడి కళ్ళ నుంచి ఏక ధారగా చాలాసేపు నీరుకారింది. తెల్లవారే సరికి అతనికి ఏనాడోపోయిన చూపు తిరిగి వచ్చింది. అతడు పొందిన ఆనందం అంతా యింతా కాదు.

గుడ్డివాడికి కళ్ళు వచ్చాయన్న విషయం ఊరంతా వింతగా చెప్పుకున్నారు. జరిగిన సంగతి రకరకాల కథల రూపంలో ప్రచార మయింది.

ఈ వార్త గూని అరండాలుకు కూడా తెలిసింది. ఆయన గుడ్డివాణ్ణి వెతుక్కుంటూ వచ్చి, ''నీకు కళ్ళు వచ్చినమాట నిజ మేనా? ఆశ్చర్యంగా ఉందే! అసలు జరిగిన దేమిటి? దాచకుండా చెప్పు.'' అన్నాడు.

''నిన్న మీ ఇంటి పక్క మాసికల బొంతతో బిచ్చగాడొకడు కూర్చుని ఆకలితో మూలుగుతున్నాడు. వాడికి నువు పట్టెడన్నం పెట్టావు కావుట. వాడికి నిన్న రాత్రి కడుపు నిండా అన్నం పెట్టాను. నాకు కళ్ళు రావాలని వాడు నన్ను ఆశీర్వదించాడు. వాడి నోటి చలవన నాకు మళ్ళీ కళ్ళు వచ్చాయి. ఇంతే జరిగింది,'' అని చెప్పాడు కళ్ళు వచ్చినవాడు.

''అయ్యో, ఎంత పొరపాటు జరిగిందీ! ఆ బిచ్చగాడు శక్తులుగల వాడై ఉండాలి. నేను వాణ్ణి కసిరి కొట్టాను. వాడికి అన్నం పెట్టి తృప్తిపరచి ఉంటే నా గూని పోగొట్టి



ఉండేవాడే!" అని అరండాలు ఎంతగానో నొచ్చుకున్నాడు.

ఎలాగైనా సరే ఆ బిచ్చగాణ్ణి పట్టి తెచ్చి, వాడికి కడుపునిండా భోజనం పెట్టి, వాడి ఆశీర్వాదంతో తన గూని పోగొట్టుకోవాలని అరండాలు నిశ్చయించుకున్నాడు.

ఆ రోజే ఆయన ఊరంతాగాలించి, మాసికల బొంత బిచ్చగాణ్ణి ఎలాగైతేనేం పట్టుకున్నాడు. అతి వినయంగా ఆయన వాణ్ణి తన ఇంటికి పిలుచుకుని వచ్చి, దగ్గిర వుండి షడ్రసోపేతంగా వాడి చేత విందు ఆరగింపజేశాడు.

బిచ్చగాడు భోజనం చేసి, "దేవుడి దయ వల్ల మీ గూని పోవాలి," అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

అరండాలుకు తన గూని పోయినట్టే అనిపించి ; మర్నాడు తెల్లవారగానే తాను కూడా అందరిలాగే నిటారుగా నిలబడగలననుకున్నాడు. అయితే అరండాలు కోరిక తీరలేదు. అతని గూని పోకపోగా, నడుము మరింత వంగినట్టు అనిపించింది.

ఆయన ఆగ్రహంతో కళ్ళు వచ్చినవాడి వద్దకు వెళ్ళి, "నిన్ను నమ్మి మోసపోయాను. ఆ బిచ్చగాడికి నీ కన్న ఘనంగా విందు పెట్టాను. వెళ్ళిపోయే ముందు నన్నూ వాడు ఆశీర్వదించాడు. కాని నాగూని పోనేలేదు. పైగా నడుము మరికాస్త పట్టుకు పోయినట్టుగావుంది," అన్నాడు.

కళ్ళు వచ్చినవాడు నవ్వి, "నువు మందమతివి. ఆ బిచ్చగాడు దేవుడేమీ కాదు. నేను కాలేకడుపుకు అన్నం పెట్టాను. బిచ్చగాడు నన్ను మనస్ఫూర్తిగా దీవించాడు. దేవుడు వాడి దీవన నిజంజేశాడు. నువు నిండిన కడుపుకు విందు చేశావు. అది కూడా స్వార్థం కొద్దీ చేశావు. బిచ్చగాడు లాంఛనగా దీవించి, తన దారిన పోయాడు. వాడి దీవనను ఎవరు నిజం చేస్తారు ?" అన్నాడు.

ఈ మాటతో అరండాలు బుద్ధి పూర్తిగా మారింది. అది మొదలు ఆయన కష్టాలలో ఉన్నవారి కందరికీ సహాయపడుతూ కీర్తి గడించాడు.



# వేషానికి తగిన ప్రవర్తన

ఒక ఊళ్ళో ఒక పగటివేషగాడు ఉండేవాడు. వాడు ప్రతి ఏడూ దసరాపండుగలు జరిగే తొమ్మిది రోజులూ రకరకాల వేషాలు వేసుకుని డబ్బు సంపాదించేవాడు.

ఒక ఏడు ఒక రోజున వాడు యోగి వేషం వేసుకుని వెళ్ళి, రాజ దర్శనం చేసుకుని, రాజుగారికి బ్రహ్మవాక్కులు చెప్పాడు. రాజు సంతోషించి వాడికి బహుమానం ఇప్పించాడు.

దానికి వాడు, "మేము యోగులం! మాకు డబ్బుతో పని లేదు," అంటూ బహుమతి నిరాకరించి వెళ్ళిపోయాడు.

మర్నాడు వాడు వేశ్య వేషం వేసుకుని రాజుగారి వద్దకు వచ్చి, ఆడి, పాడి, మెప్పించాడు. రాజుగారు వాడికి మళ్ళీ బహుమతి ఇప్పించాడు.

"మహారాజా, మరి కొంచెం మంచి బహుమానం ఇప్పించండి," అన్నాడు పగటి వేషగాడు.

రాజు ఆశ్చర్యపడి, "నిన్న బహుమతి నిరాకరిస్తివే? ఇవాళ బహుమతి చాలదంటున్నావే?" అన్నాడు.

"మహారాజా, వేసే వేషానికి తగినట్టుగా ప్రవర్తించటం అందరికీ ధర్మం కద!" అన్నాడు పగటివేషగాడు.

—జె. వి. ఎస్. చలపతిరావు





# మూడు గుభేళ్ళు

పూర్వం బస్రానగరాన్ని ఖుస్రూ అనే సుల్తాను పరిపాలించేవాడు. ఆయన ఆస్థానంలో అబ్దుల్ అనే యువకుడు ఉండేవాడు. నా అనేవారు ఎవరూ లేని అబ్దుల్‌ను ఖుస్రూ తన గుర్రాలకు సంరక్షకుడుగా నియమించాడు. అబ్దుల్ సుల్తాను గారి గుర్రాల సంరక్షణ చాలా చక్కగానే చేశాడు, కాని అతను గుర్రాల దాణా ఖర్చులో కొంత వెనక వేసుకుంటున్నట్టు వదంతి వ్యాపించింది.

ఈ సంగతి ఖుస్రూ దాకా వెళ్ళింది. ఆయన అబ్దుల్‌ను పిలిపించి, "గుర్రాల తిండి ఖర్చులో నువు కొంత కాజేస్తున్నావుట, నిజమేనా?" అని అడిగాడు.

అబ్దుల్ నీళ్ళు నమిలాడు.

ఆ నాటి నుంచీ అబ్దుల్ ఉద్యోగం మారింది. అతని కిప్పుడు నూరుమంది సైనికులకు జీతాలు ఇచ్చి, వారి వద్ద రసీదులు పుచ్చుకునే పని ఇచ్చారు. అబ్దుల్ ప్రవర్తనను కనిపెట్టటానికే ఖుస్రూ ఈ ఉద్యోగం ఇచ్చాడు. ఆ సంగతి అబ్దుల్ ఎరగడు.

ఈ కొత్త పనిలో కూడా అబ్దుల్ లంచాలు పట్టాడు. అతను సైనికులకు పూర్తి జీతాలివ్వక, కొన్ని నాణాలు తాను ఉంచుకోసాగాడు. ఇది కూడా బయటపడింది.

డబ్బుతో సంబంధించిన పని ఏదీ ఇవ్వగూడదనుకుని ఖుస్రూ అబ్దుల్‌కు పూల తోటకు కాపలా కాసే పని ఇచ్చాడు. అతని కింద పదిమంది తోటకూలీలు ఉండేవారు.

రెండు నెలల పాటు అబ్దుల్ మీద ఏ ఫిర్యాదూ రాలేదు.

ఒకనాడు ఖుస్రూగారి చిన్న కొడుకు తోటలో ఆడుకుంటూ బంతిని గట్టిగా తన్నాడు. అది అబ్దుల్‌కు తగిలింది. అబ్దుల్ విరుచుకు పడిపోయాడు. కుర్రవాడు

మేడిశెట్టి వీరవెంకటసత్యనారాయణ

గాభరాపడి అబ్దుల్ వద్దకు వచ్చి, అతన్ని కుదిపి చూశాడు.

అబ్దుల్ నెమ్మదిగా కళ్ళు తెరిచి, "ఈ సంగతి సుల్తానుగారికి చెబుతాను ఉండు!" అన్నాడు.

సుల్తాను కొడుకు ఒణికిపోయాడు. అతడికి తండ్రి అంటే తగని భయం. ఈ సంగతి తన తండ్రికి చెప్పవద్దని ఆ కుర్రవాడు అబ్దుల్‌ను బతిమాలసాగాడు. అబ్దుల్ ఆ కుర్రవాడి మెడలో ఉన్న ముత్యాల హారం కేసి తదేకంగా చూడసాగాడు. ఆ కుర్రవాడు ఆ హారాన్ని అబ్దుల్ కిచ్చి మంచి చేసుకోవాలనుకున్నాడు. అబ్దుల్ ఏమీ అనకుండా కుర్రవాడిచ్చిన హారాన్ని తీసుకున్నాడు.

అది మొదలు సుల్తానుగారి చిన్న కొడుకు అబ్దుల్‌కు డబ్బూ, చిన్న చిన్న బంగారు వస్తువులూ ఇస్తూ వచ్చాడు. ఈ సంగతి తోటమాలీలకు తెలిసిపోయింది. వాళ్ళు సుల్తానుగారితో చెబుతామని బెదిరించారు.

అబ్దుల్ భయపడటానికి మారుగా, "సుల్తానుగారి అబ్బాయి నాకిచ్చే బహుమానాలలో వాటా కోసం నన్ను బెదిరిస్తున్నారని నేనే వెళ్ళి సుల్తానుగారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు.

తోటమాలీలు హడలిపోయారు. అది గ్రహించి అబ్దుల్, తోటమాలీలు తనకు నెలకు రెండేసి రాగి డబ్బులు ఇచ్చినట్టయితే ఫిర్యాదు చెయ్యనన్నాడు. తోటమాలీలు అందుకు ఒప్పుకున్నారు.



అయితే, సుల్తానుగారి భార్య తన కొడుకు ఆభరణాలు మాయమవుతున్న సంగతి పసికట్టింది. కుర్రవాణ్ణి నిలవదీసి అడిగితే, వాడు భయపడుతూ నిజం చెప్పేశాడు.

ఈ సంగతి ఖుస్రూ దాకా వెళ్ళింది. అబ్దుల్ సుల్తాను కొడుకు దగ్గిర నగలూ, నాణ్యాలూ పుచ్చుకుంటున్నట్టు తోట మాలీలు సాక్ష్యం చెప్పారు. ఖుస్రూ అబ్దుల్‌ను దివాణం నుంచి వెళ్ళగొట్టి, "నీ ముఖం మళ్ళీ చూపకు!" అన్నాడు.

అబ్దుల్ దివాణం విడిచి వెళ్లిపోయి, మూడు రోజుల అనంతరం కోట సింహద్వారం వెలపల మకాం వేశాడు. అతను తన ముందు కొన్ని చిత్తాపుస్తకాలు పెట్టుకుని, తాను చూసేదీ, వినేదీ, సమస్తమూ విచక్షణ లేకుండా రాసుకోసాగాడు; కోటలోకి ఎవరు వెళ్ళారో, ఎవరు బయటికి వచ్చారో, వారి వెంట ఏమేమి సరుకులున్నాయో రాశాడు; చివరకు ఎక్కడన్నా గాడిద ఓండ్ర పెట్టినా అది పుస్తకంలోకి ఎక్కేది. అతన్ని చూసి ఎరిగినవాళ్ళు నవ్వుకునేవాళ్ళు. అబ్దుల్ చేస్తున్న పని గురించి విని సుల్తాను కూడా విరగబడి నవ్వాడు. అబ్దుల్‌కు మతి చెడిందని అందరూ అనుకున్నారు.

కొన్ని నెలలు గడిచాయి.

ఒకరోజు అర్థరాత్రివేళ అబ్దుల్ యథాస్థానంలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. ఇంతలో, కోటకు ఉత్తరపు దిక్కుగా ఉన్న పెద్ద కందకం నీటిలో ఏవో



బరువైన వస్తువులు పడ్డట్టుగా మూడు సార్లు చప్పుడయింది. తరవాత మరి శబ్దం లేదు. అబ్దుల్ చప్పున పుస్తకం తీసి, "ఉత్తరపు కందకంలో మూడు గుభేళ్ళు." అని రాసుకున్నాడు.

జరిగిన దేమిటంటే, ఆ క్రితం రోజు ఏదో ఉత్సవం కావటంచేత కాపలావాళ్ళు తప్ప తాగి, నిద్రపోయారు. ఆ రాత్రి ముగ్గురు గజ దొంగలు కోటలో ప్రవేశించి, ఖజానా కొల్లగొట్టి, మూడు పెద్ద పెట్టెల నిండా బంగారు, వెండి నాణాలు నింపి, కందకం దాకా తెచ్చి, అందులో వేశారు. రాత్రి పూట కందకం మీది వంతెన ఎత్తి వుంటుంది గనకా, కందకం చాలా వెడల్పూ, లోతూ కావటంచేతా దొంగలు దాన్ని ఆ సమయంలో దాటటం సాధ్యం కాలేదు. తరవాత, అవకాశం దొరికినప్పుడు కందకంలోని పెట్టెలు తీసుకుపోదామనుకున్నారు దొంగలు.

తెల్లవారుతూనే ఖజానా దోపిడీ వార్త అంతటా పాక్కింది. ఎంత వెతికినా దొంగలు గాని, పోయిన సొమ్ముగాని దొరక లేదు,

ఖుస్రూతో అంతరంగికుడు ఒకడు, "అబ్దుల్ అహోరాత్రాలు కోట ద్వారాన్ని వదలక కూర్చుంటాడు గదా, అతని చిఠాలో ఈ దొంగతనం తాలూకు ఏమైనా రాసి ఉన్నదేమో విచారింతామా, హుజూర్?" అన్నాడు.

ఖుస్రూ అబ్దుల్‌ను చిఠా పుస్తకాలతో సహా రమ్మని ఆజ్ఞాపించాడు. అబ్దుల్ దొంగతనం జరిగిన రాత్రి రాసుకున్నదాంట్లో, "ఉత్తరపు కందకంలో మూడు గుభేళ్ళు." అని ఉన్నది.

అదేమిటో అర్థంకాక ఖుస్రూ, "ఏమిటీ గుభేళ్ళు?" అని అబ్దుల్‌ను అడిగాడు.

"హుజూర్, నీటిలో బరువైన వస్తువు పడితే గుభేల్ అని చప్పుడు కాదా? అలాటి చప్పుళ్ళు మూడు వినిపించాయి," అన్నాడు అబ్దుల్.

వెంటనే కొందరు మనుషులు వెళ్ళి కందకంలోకి దిగి గాలించేసరికి మూడు పెట్టెలు దొరికాయి. వాటిలో పోయిన సొమ్మంతా ఉన్నది. ఖుస్రూ సంతోషించి అబ్దుల్‌ను తన సలహాదారుగా ఉంచుకున్నాడు.





# అదృష్టం

విజయవర్మ ఒక చిన్న దేశానికి రాజు. ఆయనకు విజయ అని ఒక కుమార్తె ఉండేది. విజయకు పదహారేళ్ళు నిండిన రోజున తండ్రి ఆమెకు ఒక ఉంగరం పెట్టాడు. అది రాజుకు ప్రాణప్రదమైనది. ఎందు చేతనంటే, ఆ ఉంగరం విజయతల్లిది. ఆమె కొంతకాలం క్రితం చనిపోయింది.

ఒకనాడు విజయ తన దాదితో సహా చిన్న పడవలో నది మీద విహారానికి బయలుదేరింది.

పడవలో పోతూ విజయ తన చేతిని నీటిలో ముంచి, తన వేళ్ళ సందుగా నీరు ప్రవహిస్తుంటే ఆనందిస్తున్నది. అప్పుడు ఆమె వేలిఉంగరం జారి నీటిలోపడింది.

విజయ కేక పెట్టేసరికి పడవవాడు తెడ్డు వేయటం ఆపి, నదిలోకి దిగి, ఉంగరం పడి పోయిన ప్రాంతం అంతా ఎంతోసేపు వెతికాడు. కాని ఉంగరం దొరకలేదు.

విజయవర్మ కఠినుడు కాడు, కాని ఉంగరం పారేసుకున్నందుకు ఆయన విజయను క్షమించలేక పోయాడు.

విజయ ఇంటికి తిరిగి వచ్చి తనతో ఉంగరం పోయిన మాట చెప్పబోయేసరికి విజయవర్మ అడ్డం వచ్చి, "ఇది క్షమించ రాని నేరం. నాకా ఉంగరం ప్రాణంతో సమానమైనది. నేను నీతో ఇంకో విషయం మాట్లాడాలి. నిన్ను పెళ్ళాడగోరి మహేశుడు అనే యువకుడు నా దగ్గిరికి వచ్చాడు. నీకు అతను తెలుసా?" అని అడిగాడు.

తెలుసునన్నది విజయ.

"నీకు అతనంటే ఇష్టమా?" అని విజయపర్మ మళ్ళీ అడిగాడు.

"అవును, నాన్నా," అన్నది విజయ.

"నీ దురదృష్టం! నా కూతురికి అతను తగినవాడుగా కనిపించలేదు. అతను నిన్ను చేసుకోవటానికి వీలులేదని చెప్పి పంపేశాను.

జె. శకుంతల

నువు నా కిష్టమైన ఉంగరాన్ని పారేశావు. నేను నీ కిష్టమైన వాణ్ణి పంపేశాను. నా ఉంగరాన్ని ఎవరు తెస్తే వాడికి నిన్ను ఇచ్చి పెళ్ళి చేస్తానని చాటింపు వేయించబోతున్నాను,'' అన్నాడు విజయవర్మ.

చాటింపు వినగానే ఎక్కడెక్కడి యువకులూ వచ్చి, విజయ పారేసుకున్న ఉంగరం కోసం నదిని కెలికి కెలికి వదిలి పెట్టారు. కాని ఉంగరం మటుకు దొరకలేదు.

విజయ పెళ్ళాడగోరిన మహేశుడు మాత్రం ఈ పోటీలో పాల్గొనలేదు. విజయను తన కివ్వనని విజయవర్మ అన్న క్షణం నుంచీ అతనికి విరక్తి కలిగింది. అతను నదీతీరాన అరణ్యాలలో చెట్లమధ్య ఒంటరిగా కాలం వెళ్ళబుచ్చేవాడు.

ఒకనాడు అతను నది అవతలి ఒడ్డున వేటాడుదామని విల్లూ బాణాలూ తీసుకుని నది దిగువకు వెళ్ళాడు. తలవని తలంపుగా అతనికి ఇవతలి ఒడ్డున ఒక లేడి కనిపించింది. అతను బాణం ఒకటి తీసి ఎక్కుపెట్టి, గురి చూసి వదిలాడు. అదే సమయంలో ఒక పెద్ద చేప నీటి మీదికి ఎగిరింది. మహేశుడి బాణం ఆ చేపలో గుచ్చుకున్నది. చేప పెద్ద చప్పుడుతో నీటిలో పడింది.

ఆ చప్పుడుకు లేడి తల ఎత్తి మహేశుణ్ణి చూసి, చెట్లలో అదృశ్యమయింది.

''లేడిని కొట్టాలనుకుంటే చేప దొరికింది,'' అనుకుని మహేశుడు ఆ చేపను నీటిలో నుంచి తీసి ఇంటికి పట్టుకుపోయాడు.

అతని తల్లి ఆ చేపను తరగగానే, దాని పొట్టలో ఉంగరం కనిపించింది. అదే విజయ పోగొట్టుకున్న ఉంగరం. చేప మింగిన కారణం చేతనే అది ఎవరికీ దొరక లేదు.

మహేశుడు ఆ ఉంగరాన్ని మర్నాడు రాజుకు సమర్పించాడు. విజయవర్మకు మహేశుడంటే ఇష్టం లేకపోయినా అన్న మాట నిలబెట్టుకునేటందుకు అతనికి విజయ నిచ్చి పెళ్ళి చేశాడు.

అదృష్టం విజయది. ఆమె ఉంగరాన్ని పోగొట్టుకోకపోతే తాను కోరినవాణ్ణి ఎన్నటికీ పెళ్ళాడేది కాదు.





# నోటిముందుకూడు

ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. హరికథలు చెప్పటంలో ఆయన చాలా ప్రసిద్ధుడు. అందుచేత ఆయనను దూరగ్రామాల వాళ్ళు కూడా పిలుస్తూ ఉండేవాళ్ళు.

ఒకనాడు ఈ బ్రాహ్మడికి పదిమైళ్ళ దూరాన ఉన్న గ్రామం నుంచి పిలుపు వచ్చింది. ఆ రాత్రి ఆ వూళ్ళో ఆయనను హరికథ చెప్పమన్నారు. చీకటి పడే వేళకు చేరేటట్టుగా అతను ఇంటి నుంచి బయలుదేరాడు. అయితే తలవని తలంపుగా మేఘాలు కమ్మి, ఆకాశం మూసుకుపోయి, ఒక గంట ముందుగానే చీకటి పడి పోయింది. మరి కాస్సేపటికి వర్షం ముంచుకొచ్చింది.

ఆ అంధకారంలో ఆ బ్రాహ్మడికి దారి ఏ మాత్రమూ తెలియలేదు. ఆయన గమ్యస్థానం చేరే ఆశ వదులుకుని, పక్క గ్రామంలో ఎరిగిన వాళ్ళ ఇంట ఆ రాత్రి గడప నిశ్చయించుకుని, ముందుకు సాగాడు.

కాని ఎంత దూరం నడిచినా పక్క గ్రామం జాడ కనిపించలేదు. తాను దారి తప్పానని ఆయన గ్రహించాడు. ఎటు వెళ్ళాలో, ఆ రాత్రి ఎలా గడపాలో ఆయనకు ఏమీ పాలుపోలేదు. ఆయన అందోళనతో చుట్టూ కలయ జూశాడు. ఒక దిక్కుగా దీపం కాంతి కనబడింది.

బ్రాహ్మడు ఆ కాంతికేసి వెళ్ళి, ఒక ఇల్లు చేరుకున్నాడు. చాలాసేపు తట్టిన మీదట ఇంటివాడు తలుపు తెరిచి, "బాగా తడిసి పోయినట్టున్నారే? లోపలికి రండి," అన్నాడు.

బ్రాహ్మడు లోపలికి వెళ్ళాడు. ఇల్లు చూస్తే పాతకాలపు భవంతి లాగున్నది. ద్వారబంధాలకు నగిషీలు చెక్కి ఉన్నాయి. అయితే ఆ ఇంట్లో ఉన్న భార్యాభర్తలు చాలా సామాన్యుల లాగే ఉన్నారు.

పి. గోవిందాచారి

ఇంటివాడు బ్రాహ్మడి ఆలోచన గ్రహించి, "ఇల్లు గొప్పదే గానీండి, ఇందులో ఎవరూ ఉండరు. అందుకే ఇది మాకు అద్దె లేకుండా దొరికింది. చూడండి, బాబూ. మేం పడుకుని నిద్ర పోబోతున్నాం. మీరు మేడ మీది గదికి వెళ్లి, మీ తడి బట్టలు పిండి ఆరేసుకుని, అక్కడే ఈ రాత్రికి పడుకోవచ్చు," అన్నాడు.

బ్రాహ్మడు పైకి వెళ్లి, తాను కట్టుకున్న బట్టలు ఆరేసుకుని, తన జింకచర్మం సంచీలో నుంచి పొడి బట్ట తీసి కట్టుకుని, మంచం మీద నడుము వాల్చాడు. ఇప్పు డాయనకు వెచ్చగా ఉండటం చేత కొంచెం నిద్రమత్తు వచ్చింది. కాని కాస్సేపటికల్లా ఆయన ఆకలితో లేచాడు. దిగువ ఏదో సందడి వినిపించింది. వంటకాల వాసన కూడా వచ్చి, బ్రాహ్మడి ఆకలిని మరింత రెచ్చ గొట్టింది.

ఇంటి నిండా జనం ఉన్నట్టున్నారు. మొహమాట పడక కిందికి వెళ్ళి, వారితో పాటు తాను కూడా భోజనం చెయ్యాలని బ్రాహ్మడు అనుకుంటూ ఉండగా, ఎవరో మెట్ల కిందికి వచ్చి, "ఏమయ్యోయ్, వల్లన్నా, భోజనానికి దిగిరా!" అని కేక పెట్టారు.

బ్రాహ్మడి పేరు వల్లన్న కాదు. కాక పోయినా ఆయన గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళాడు. కింద పెద్ద సావట్లో ఆడవాళ్ళూ, మగవాళ్ళూ అటూ ఇటూ తిరుగుతున్నారు. ఒక పక్కగా విస్తళ్ళు వేశారు. వడ్డన జరుగుతున్నది. కొందరు వచ్చి విస్తళ్ళ ముందు కూర్చుంటున్నారు.

బ్రాహ్మడు కూడా ఒక విస్తరి ముందు కూచున్నాడు. ఆయనకు తాను సంధ్య వార్చలేదన్నది గుర్తుకు వచ్చింది. క్లుప్తంగా సంధ్య వార్చుదామని ఆయన చేతిలోకి ఇన్ని నీళ్ళు తీసుకుని, "ఉత్తిష్ఠంతు భూత పిశాచాః" అని ఆ నీటిని ముందుకు చల్లాడు.

మరుక్షణం జనమంతా మాయమయారు. విస్తళ్ళూ, వంటకాలూ, సమస్తమూ మాయ మయాయి. ఒక పాడుపడిన చీకటి కొంపలో బ్రాహ్మడు బిక్కుబిక్కుమంటూ ఒంటరిగా మిగిలిపోయాడు.





# పట్టుబడని దొంగలు

ఒక గ్రామంలో ఇద్దరు దొంగ వెధవలు ఉండేవాళ్ళు. వాళ్ళు తాము ఉండే గ్రామంలో ఎన్నడూ దొంగతనాలు చేసే వారు కారు; దొంగతనం చెయ్యదలచి నప్పుడు సమీపంలో ఉండే ఏ గ్రామానికో వెళ్ళేవారు. ఆ ఇద్దరి లోనూ ఒకడు రంగడు అనేవాడు. వాడు దొంగతనంలో సిద్ధహస్తుడు. రెండోవాడు రాముడు వాడి అనుచరుడు.

ఒకరాత్రి వాళ్ళు పొరుగూళ్ళో గొర్రెను దొంగిలించటానికని బయలు దేరారు. రాత్రి బాగా పొద్దు పోయి వాళ్ళు గ్రామం చివర, శ్మశానం పక్కగా ఉన్న శివాలయం చేరు కున్నారు. రంగడు రాముణ్ణి ధ్వజస్తంభం దిమ్మె చాటున కూర్చుని ఉండమని చెప్పి, తాను గొర్రెను తేబోయాడు.

చీకటిరాత్రి. అంతటా నిశ్శబ్దంగా ఉంది. రాముడు తన వెంట వేరుశనగకాయలు తెచ్చుకున్నాడు. ఊరికే కూర్చోవటం విసుగెత్తి, వాడు మూటవిప్పి, వేరుశనగ డిప్పలు పంటితో కొరికి, పప్పులు తినసాగాడు.

మండపం మీద పడుకుని నిద్రపోతున్న శివాలయం నౌకరు అకస్మాత్తుగా మేలుకుని కటకట మన్న శబ్దం విన్నాడు. శ్మశానంలో రాత్రిపూట దయ్యాలు తిరుగుతాయని వాడు విన్నాడు. కాని అవి శ్మశానంలోనే ఉంటా యనీ, పాతిపెట్టిన శవాలను పీక్కుతింటా యనీ వాడి నమ్మకం. ఆ దయ్యాలు తిన్నగా గుడిలోకే వచ్చి ఎముకలను కొరుకుతాయని వాడు కలలో కూడా ఊహించలేదు.

ఆలయంలోకి దయ్యాలు వస్తే వాటిని వెళ్ళగొట్టే పని పూజారిది. అలా అనుకుని ఆలయం నౌకరు మండపం దిగి పూజారి ఇంటికి వెళ్ళి, తలుపు తట్టి, పూజారిని లేపి, "ఏం, స్వామీ! శ్మశానంలో దయ్యాలు శవాలను తెచ్చి గుళ్ళోనే తింటున్నాయి.

ఏ. జగన్మోహన్

వచ్చి వాటిని తోలెయ్యండి. లేకపోతే గుడికి అప్రతిష్ఠ!" అన్నాడు.

పూజారి స్థూలకాయుడు. ఆయనకు కీళ్ళవాతం ఉన్నది. వాతపు నొప్పులు రాత్రి పూట మరీ జాస్తిగా ఉంటాయి. కాలు తీసి కాలు పెట్టటానికి ప్రాణం పోయినంత పని అవుతుంది. "నేను అడుగు కూడా నడవ లేను. ఎలాగురా?" అన్నాడు పూజారి.

"తమరు రాక తప్పదు. నడపలేకపోతే నా భుజాలమీద ఎక్కి కూర్చోండి. నేను తీసుకు పోతాను," అన్నాడు నౌకరు.

విధిలేక పూజారి ఆలయం నౌకరు భుజాలమీద ఎక్కి బయలుదేరాడు.

ఈ లోపుగా రాముడు వేరుశనక్కాయలు తినటం పూర్తి చేసి, ఎవరో వొస్తున్న అలికిడివిని, ధ్వజస్తంభం పక్కనుంచి తొంగిచూశాడు. ఎవరో మనిషి తన భుజాల మీద ఏదో లావుపాటిదాన్ని మోసుకువొస్తూ ఉండటం వాడికి కనిపించింది.

ఆ వచ్చేది రంగడే అనుకుని రాముడు, "బాగా బలిసినదేనా?" అని అడిగాడు.

ఈ మాట వినగానే ఆలయం నౌకరు పై ప్రాణాలు పైనే పోయినంత పని అయింది. వాడు పూజారిని చప్టాన కింద పారేసి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు.

పూజారికి కూడా కీళ్ళ నొప్పులు అంతగా తెలిసినట్టు లేదు. ఆయన శరవేగంతో వెళ్ళి తన ఇంట్లోపడి, తలుపులు బిడాయించేసుకున్నాడు.

తరవాత కొంచెం సేపటికి రంగడు ఒక చిన్న గొర్రెను తీసుకువచ్చి, "రా, పోదాం!" అని రాముణ్ణి పిలిచాడు. ఇద్దరూ చీకట్లోనే తమ గ్రామానికి వెళ్ళి పోయారు.

మర్నాడు ఉదయం ఆలయం నౌకరు ఊడుస్తూ, ధ్వజ స్తంభం వెనక వేరు శనగ డిప్పలు చూశాడు. వాడు కిందటి రాత్రి విన్న కట కట శబ్దాలు ఏమిటో వాడికి అర్థమయింది. వాడు ఆ సంగతి పూజారికి తప్ప ఇంకెవరికీ చెప్పలేదు. ఆ రహస్యం పూజారికీ, నౌకరుకూ తప్ప మూడోవాడికి తెలియదు.






# తెలివిగల ఆడది

ఒక గ్రామంలో పూర్ణమ్మ అనే వయసు మళ్ళిన విధవరాలు, తన ఇంటి ముందు అరుగు మీదనే చిన్న దుకాణం పెట్టుకుని, ఒంటరిగా జీవిస్తూ ఉండేది. అమె పేదగానే బతుకుతున్నప్పటికీ, అమె పెట్టెలో కొన్ని బంగారు నగలూ, కొంత ధనమూ చేరిందని ఊళ్ళో పుకారు ఉండేది. ఆ మాట నిజమే కూడానూ.

కొంతకాలంగా చుట్టుపక్కల గ్రామాలలో దొంగతనాలు జరుగుతూ వచ్చాయి. చివరకు పూర్ణమ్మ ఉండే గ్రామంలో కూడా రెండు మూడు చిన్నా పెద్ద దొంగతనాలు జరిగాయి.

ఊళ్ళో అలజడి రేగింది. దొంగను పట్టటానికి ఊళ్లోని యువకులు నడుములు బిగించారు. గ్రామాధికారి దొంగను పట్టిన వారికి మంచి బహుమానం ఇస్తానని ప్రకటించాడు. పారుగూరి వాడైన దొంగకు ఈ విషయాలు చూచాయగానైనా తెలియరాలేదు.

దొంగలు తన ఇంటికే వస్తే ఏం చెయ్యాలా అని పూర్ణమ్మ దీర్ఘంగా ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చింది. తన ఉపాయం పారి, దొంగను పట్టుకుంటే గ్రామాధికారి ప్రకటించిన బహుమానం తానే పొందవచ్చునని కూడా ఆమె అనుకున్నది. అందు చేత, ఊళ్ళో అందరూ దొంగలు తమ ఇళ్ళకు వస్తారేమోనని భయపడుతుంటే, పూర్ణమ్మ మాత్రం దొంగల కోసం ఆత్రంగా ఎదురు చూడసాగింది.

ఒక రాత్రి దొంగవాడు పూర్ణమ్మ ఇంటికి రానే వచ్చాడు. పూర్ణమ్మ మేలుకునే ఉన్నది. దొంగ ఇల్లు ప్రవేశించిన అలికిడి వినగానే అమె, "నువేనా, నాయనా?" అన్నది చిన్నగా. దొంగ దిగ్భ్రాంతుడై మాట్లాడలేక చూస్తూ వూరుకున్నాడు.

కాళ్ళ గోవిందరావు

"నీ డబ్బు పట్టుకుపోతావా? ఈ పాటి కది రెట్టింపు అయి ఉంటుంది. చూసి ఎంచుకో," అన్నది పూర్ణమ్మ మళ్ళీ.

దొంగకు ఆమె ఏమి మట్లాడుతున్నదీ అర్థంకాలేదు. ఒకవేళ ఆమె వెర్రిమనిషేమో ననుకున్నాడు.

పూర్ణమ్మ మంచం మీదినుంచి లేచి, "నువు నిన్న వచ్చిన వాడివి కావా ఏమిటి? అతగాడు నా పెట్టె రహస్యం అందరికీ చెప్పేస్తున్నాడు కాబోలు. ఇలా అయితే గ్రామ పెద్దలు నన్ను బతకనివ్వరు!" అంటూ దీపం వెలిగించింది.

ఒక క్షణంపాటు దొంగకు పారిపోవాలని పించింది. కాని ఆమెవల్ల తనకు ప్రమాదం లేదనుకునీ, ఆమె మాటలకు అర్థం ఏమిటో తెలుసుకోవాలనుకునీ వాడు కదలామెదలక ఉండిపోయాడు.

దీపం వెలుతురులో దొంగను చూసి పూర్ణమ్మ, "ఇంకేం? నువు మామూలు దొంగవు కావు. నీకు నా పెట్టె రహస్యం వాడే చెప్పి ఉంటాడు," అన్నది.

"నా కెవరూ చెప్పలేదు. ఏమిటి దాని రహస్యం?" అన్నాడు దొంగ.

"చూపిస్తానుండు," అంటూ పూర్ణమ్మ తన కొయ్యపెట్టె తెరిచి, అందులో ఉన్న నగలూ, డబ్బూ పైకి తీసి లెక్కపెట్టి, "చూశావా, నిన్న మా దొంగ ఇందులో పెట్టిన దంతా రెట్టింపు అయింది. ఈ రాత్రి వచ్చి తీసుకు పోతానన్నాడు. ఎందు చేతనో రాలేదు. నువే వాడనుకుని నా పెట్టెరహస్యం



కాస్తా బయట పెట్టేశాను. ఒకరికి ఇద్దరు దొంగలు ఇంటికి వచ్చిపోతూ ఉంటే అధి కార్లకు తప్పక తెలుస్తుంది. నన్ను కొరత వేస్తారు. నాయనా, నీకు పుణ్యం ఉంటుంది. నువు ఈ మాట ఎక్కడా చెప్పక, నీ దారిన నువు వెళ్ళు. నా పెట్టె ధర్మమా అని ఆ దొంగ చిన్న చిన్న దొంగతనాలతోనే సుఖంగా బతక గలుగుతున్నాడు. నాకూ తృణమో, పణమో గిట్టుతున్నది. అందు చేత నా రహస్యం కాపాడు,'' అన్నది.

దొంగకు ఆశపుట్టింది. వాడు పూర్ణమ్మతో, "చూడు, పిన్నమ్మా! నా సొమ్ము కూడా రెట్టింపు చేసి పెట్టావంటే నీ రుణం ఉంచు కోను. నీ రహస్యం నేను ప్రాణంతో సమంగా కాపాడతాను. రేపు రాత్రి వచ్చి నేను పోగు చేసినదంతా తెచ్చి నీ పెట్టెలో పెడతాను. దాన్ని రెట్టింపు చేసిపెట్టు. నీకు ఏ ప్రమా దమూ రాకుండా నేను చూస్తాను. కాదనకు!'' అని ప్రాధేయపడ్డాడు.

"ఏమో, నాయనా! నువు ఈ వూరి వాడివైనా కావు. ఊళ్ళోవాళ్ళు దొంగలను పట్టటానికి విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. కాదు కూడదంటున్నావు గనక, నా పెట్టెను ఒక్కసారి ఉపయోగించుకోనిస్తాను. ఆ తర వాత నువ్వెవరో, నేనెవరో! తెలిసిందా? రేపు రాత్రి ఈ వేళకే రా!'' అన్నది పూర్ణమ్మ.

దొంగ వెళ్ళిపోయాడు.

తెల్లవారగానే పూర్ణమ్మ గ్రామాధికారికి సంగతంతా తెలిపి, దొంగను తన ఇంట సొత్తుతోసహా పట్టుకునే ఏర్పాట్లు చేసుకో మన్నది.

ఆ దొంగ ఆశాపాతకుడై తాను చాలా కాలంగా ఎన్నోచోట్ల దోచిన నగలూ, నగదూ యావత్తూ తెచ్చి, అర్ధరాత్రివేళ పూర్ణమ్మ ఇంట ప్రవేశించి దొరికిపోయాడు.

మర్నాడు గ్రామాధికారి దొంగ వద్ద దొరికిన సొత్తంతా జాబితావేసి, ఎవరెవరు ఏమేమి పోగొట్టుకున్నారో విచారించి, ఎవరి సొమ్ము వారికి తిరిగి ఇప్పించేసి, పూర్ణమ్మకు మంచి బహుమతి ఇప్పించాడు.

ఆ దొంగకు ఖైదు శిక్ష పడినాక ఆ చుట్టు పక్కల దొంగతనాలు నిలిచిపోయాయి.



# విదూషకుడి పందెం

ఒక రాజుగారికి గుర్రపు పందాలంటే ఇష్టం. ఆయన తరుచుగా వాటి చేత పరిగెత్తించి, అన్నిటి కన్న ముందు వచ్చిన గుర్రానికి బహుమానం ఇచ్చేవాడు.

ఒకసారి విదూషకుడు రాజుతో, "మహారాజా, ఈసారి అన్నిటి కన్న ఆఖరున వచ్చిన గుర్రానికి బహుమానం ఇవ్వండి. ఆ పందెం చూడ ముచ్చటగా ఉంటుంది," అన్నాడు.

"గుర్రాలు పరిగెత్తవు గద! చూడటానికేమున్నది?" అన్నాడు రాజు అయోమయంగా.

"లేదు, మహారాజా! గుర్రాలు పరిగెత్తేటట్టు చేసే పూచీ నాది!" అన్నాడు విదూషకుడు.

రాజు ఇద్దరు రౌతులను పిలిచి, వాళ్ళు తమ గుర్రాలను పరిగెత్తించాలని, చివర వచ్చిన గుర్రానికి బహుమానం ఇస్తాననీ అన్నాడు. విదూషకుడు వాళ్ళకేదో చెప్పి పంపేశాడు.

త్వరలోనే ఇద్దరు రౌతులూ గుర్రా లెక్కి వచ్చారు. వాళ్ళు ఫలాని చెట్టు దాకా వెళ్ళి రావాలని రాజు అన్నాడు.

రెండు గుర్రాలూ శరవేగంతో బయలుదేరి, గమ్యస్థానం చేరి, తిరిగి రాసాగాయి.

రాజు ఆశ్చర్యపడి విదూషకుణ్ణి, "వాళ్ళతో ఏమని చెప్పావు?" అన్నాడు.

"గుర్రాలు మార్చుకోమన్నాను!" అన్నాడు విదూషకుడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి






# మూడుగండాలు

ఒక గ్రామంలో ఒక కామందు కింద ఒక పేద పాలేరు పని చేసేవాడు. ఆ పాలేరుకు ఒక కొడుకుండేవాడు. వాడు చాలా చలాకీ అయిన కుర్రవాడు. కామందు ప్రతి శుక్రవారమూ వెన్న చిలికిన మజ్జిగను ఆ కుర్రవాడికి ఇప్పిస్తూ ఉండేవాడు. వాడు దాన్ని శుక్రవారం సంతకు తీసుకు పోయి అమ్మి, డబ్బు చేసుకుంటూ ఉండేవాడు. ఆ కారణం చేత అందరూ వాణ్ణి 'మజ్జిగ బుల్లాడు' అని పిలుస్తూండేవారు.

ప్రతి శుక్రవారమూ వీరన్న అనేవాడు సంతకు బండి తోలుకుపోయేవాడు. మజ్జిగ బుల్లాడు ఆ బండిలోనే తన మజ్జిగ కుండతో సంతకు వెళ్ళి, మళ్ళీ అందులోనే తిరిగి వస్తూండేవాడు.

ఒకనాడు వాడు సంతలో మజ్జిగ అమ్ముతూండగా ఒక పొడుగాటి ముసలిముండ వచ్చి, మజ్జిగ పొయ్యమన్నది.

"లోటా ఒక డబ్బు. అర లోటా అర డబ్బు. ఎంతకు పొయ్యమన్నావు?" అన్నాడు బుల్లాడు.

"డబ్బూ లేదు, దుబ్బూ లేదు. ఊరికే పొయ్యి!" అన్నది ముసలిముండ.

"ఈ బేరాలు మన దగ్గిర కాదు! నడు, నడు!" అన్నాడు బుల్లాడు.

ముసలిది దగ్గిరికి వచ్చి చల్ల కుండ మీద చెయ్యి వేయబోయింది. బుల్లాడు చల్ల గరిటతో దాని చేతి మీద గట్టిగా ఒకటి పెట్టాడు. ముసలిది వెళ్ళిపోయింది.

సాయంత్రానికల్లా మజ్జిగ పూర్తిగా అమ్ముడయింది. బుల్లాడు కుండా, గరిటా వీరన్న బండిలో పెట్టి, "నేను కాస్త ఊరు చుట్టి, నడిచి ఇంటికి వస్తాలే," అని బండిని పంపాడు. బండి వెళ్ళిపోయింది.

బుల్లాడు కొంతసేపు ఊరు చుట్టబెట్టి, ఇంటి దారి పట్టాడు. కొంతదూరం వెళ్ళాక

హెచ్. బలరామయ్య




చురుకుగానే పని చేస్తున్నది. కొంతసేపటికి ఎవరో ఈలపాట పాడుతూ అటుగా రావటం వాడికి వినిపించింది. వాడు, ''అయ్యా, నన్ను విడిపించి పుణ్యం కట్టుకోండి!'' అని అరిచాడు.

ఆ మనిషి గోతం మూతి విప్పి బుల్లాణ్ణి బయటికి తీశాడు. ఆ మనిషి ఒక సైనికుడు. అతను బుల్లాడి కథ అంతా విని ముసలిదానికి బుద్ధి చెప్పాలనుకుని, గోతం నిండా ముళ్ళకంచె కొమ్మలూ, బరువు కోసం ఇంత మట్టీ గోతంలో నింపి, తిరిగి మూతి కట్టాడు. తరవాత ఇద్దరూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.

తన వెనక ఎవరో వస్తున్నట్టు వాడికి అడుగుల చప్పుడు వినిపించింది. వాడు వెనక్కు తిరిగి చూసేటంతలో ముసలిది వాడి నెత్తిన ఒక గోతం కప్పి, వాడితో సహా ఆ గోతాన్ని అవలీలగా తల కిందులు చేసి, దాని మూతికి తాడు కట్టింది.

అంతలోనే ముసలిదానికి ఒక మాట గుర్తు వచ్చింది. బస్తీలో పెద్దింటి వంటలక్క ఊరగాయ పెడతానన్నది. ఆ మాట గుర్తు రాగానే ముసలిది, ఆ గోతాన్ని ఆ కాలిబాట పక్కన వదిలి, తిరిగి పట్టణానికి వెళ్ళింది.

బుల్లాడు గోతంలో మడతబడి యిబ్బందిలో ఉన్నాడు. కాని వాడి బుర్ర

కొంతసేపటికి ముసలిది వచ్చి, గోతం ఎత్తుకుని ఇంటి దారి పట్టింది. గోతంలో ఉన్న ముళ్ళు వీపులో గుచ్చుకున్నాయి.

''దొంగ వెధవా! సూదులు పెట్టి పొడుస్తావా? నీ సంగతి చెబుతాలే!'' అంటూ ముసలిది తన ఇల్లు చేరి, గోతం మూతి విప్పి అందులో ఉన్నదంతా తన పక్క మీద కుమ్మరించింది. పక్కంతా పాడయింది.

మళ్ళీ శుక్రవారం వచ్చింది. బుల్లాడు వీరన్న బండిలో సంతకు వెళ్ళి, మజ్జిగ మామూలుగానే అమ్ముకుని, ఈసారి వీరన్న బండిలోనే ఇంటికి బయలుదేరాడు. మధ్య దారిలో ఇరుసు సీల కాస్తా విరిగింది.

"బస్తీకి వెళ్లి కమ్మరి చేత ఇంకో సీల చేయించుకు వస్తాను," అని వీరన్న వెనక్కు వెళ్ళాడు. బుల్లాడు బండీలో కూర్చోవటంతో విసిగి, బండి దిగి అటూ ఇటూ పచార్లు చేయసాగాడు.

ముసలిది ఎటు నుంచో వచ్చి, వాడి నెత్తిన గోతం బోర్లించి, మళ్ళీ వాణ్ణి బంధించి, తన ఇంటికి బయలుదేరింది.

మధ్య దారిలో దాని కొక ఆలోచన వచ్చింది. అది వచ్చిన దారిలో ఒక కాయగూరల తోట ఉన్నది. దాని చుట్టూ కంచె ఉన్నది గాని, దానిలో మనిషి దూరే సందున్నది. ఈ వేళప్పుడు ఎవరూ చూడరు. అక్కడికి వెళ్ళి కాస్త కూర దొంగిలింతామనుకుని, ముసలిది గోతాన్ని అక్కడే వదిలి వెళ్ళింది.

అటుగా ఎవరన్నా వస్తారేమోనని చూస్తున్న బుల్లాడికి ఎవరో పిల్లిలాగా నడుస్తూ వొస్తున్నట్టు అనిపించింది. ఆ మనిషి దగ్గిరిగా వచ్చినట్టు తోచగానే వాడు, "అయ్యా, రక్షించండి," అని మెల్లిగా అన్నాడు.

ఆ వచ్చిన మనిషి దొంగ. వాడు గోతాం మూతి విప్పి, బుల్లాణ్ణి విడిపించి, సంగతి తెలుసుకున్నాడు. ముసలిదానికి శాస్తి చెయ్యాలని ఆ దొంగ గోతాంనిండా చిన్న చిన్న రాళ్లూ, తడి మట్టీ కలిపి పెట్టి, తిరిగి



గోతాం మూతి కట్టేశాడు. తరువాత ఇద్దరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు.

ముసలిది కూరలు దొంగిలించి వచ్చి, గోతాం వీపుకు ఎత్తుకుని, "నీ మోచేతులూ, మోకాళ్ళూ తెగ పొడుస్తున్నాయేంరా!" అన్నది. ఆ మూట విప్పి, పక్కమీద కుమ్మరించాక తాను మళ్ళా మోసపోయినట్టు ముసలిదానికి తెలియవచ్చింది.

మరొక శుక్రవారం వచ్చింది. ఈసారి వీరన్న కాస్త ఎండ ఉండగానే ఇంటికి బయలుదేరాడు. బుల్లాడు కూడా తగిన జాగ్రత్త మీదే ఉండి, ముసలి దాని చెయ్యి తాకితే పొడవటానికి చాకు కూడా వెంట తెచ్చుకున్నాడు.

తిరుగు ప్రయాణం కొంత దూరం సాగిన తరువాత వీరన్న చింతతోపు దగ్గర బండి ఆపి, "ఒరే, చింత గుల్లలు ఏరుకొద్దాం!" అన్నాడు.

ఇంకా చీకటి పడలేదు గనకనూ, తన వద్ద చాకు ఉన్నది గనకనూ బుల్లాడు భయపడలేదు.

ఇద్దరూ చింతతోపులో చెరొక పక్కగానూ ప్రవేశించి చింతగుల్లలు ఏరసాగారు. ముసలిది ఏ చెట్టు చాటునో ఉండి, బుల్లాడి నోటి మీద చెయ్యి పెట్టి, అరవకుండా వాడి నోట గుడ్డ కుక్కి, గోతంలో బిగించి, తిన్నగా ఇంటికి మోసుకు పోయింది.

ఆమె ఆ గోతాన్ని ఒక పక్క పెట్టి, కత్తి తీసి దాన్ని రాతి మీద నూరింది. ఇంతలో ఆమెకు పొయిలో మంట తగ్గినట్టు కనబడింది. పొయి మీద ఉన్న కుండమీది మూత ఎత్తి చూస్తే నీరు ఇంకా మసులు పెట్టలేదు. త్వరగా చితుకులు వెయ్యకపోతే పొయిలో నిప్పు కాస్తా ఆరిపోయేటట్టున్నది. ఇంట్లో చితుకులు లేవు. అందుచేత ముసలిది ఒక తాడు తీసుకుని, ఎండు పుల్లలు కట్టుకు రావటానికి గబగబా వెళ్ళిపోయింది.

తలుపు మూసిన చప్పుడు వింటూనే బుల్లాడు తన చాకు తీసి గోతం అడుగున ఉన్న కుట్లు కోసి బయటికి వచ్చాడు. వాడు చుట్టూ కలయజూస్తే ముసలిదాని కుండలూ, పిడతలూ, దుత్తలూ, మూకుళ్లూ కనపడ్డాయి. బుల్లాడు గోతాం నిండా వాటిని నింపి, గోతాన్ని ఎప్పటి లాగా చేసి, తలుపు తెరుచుకుని, ముసలిదాని గుడిసెకు ఒక మూల నిప్పుపెట్టి, ఇంటిదారి పట్టాడు.

అంతలోనే ముసలిది తిరిగి వచ్చి, తలుపు గడియ పెట్టి, చితుకులు వేసి పొయిలో మంటచేసి గోతాం మూతి విప్పి, "ఇప్పుడెక్కడికి పోతావురా?" అంటూ, కత్తి సిద్ధంగా పట్టుకుని, గోతాన్ని కుమ్మరించింది. అందులోని కుండ సామానంతా పెద్ద మోతతో కిందపడి పగిలింది. ఈ అడావుడిలో ముసలిది తన గుడిసె అంటుకున్న సంగతి గమనించక, గమనించినాక బయటికి రాలేక, ఆ గుడిసెతోనే కాలిపోయింది.






చావు తప్పి కన్ను లొట్ట పోయినట్టుగా అయి దుర్యోధనుడు తన వారి నందరినీ కలుసుకుని, దుర్భరమైన అవమానంతో కుంగిపోతూ, హస్తినాపురికి ప్రయాణమై, దారిలో ఒక చెరువు ఉండే చోట మజిలీ చేశాడు.

యుద్ధరంగం నుంచి పారిపోయిన కర్ణుడు ఆ మజిలీలో తిరిగి దుర్యోధనుణ్ణి చేరుకుని, జరిగిన సంగతి ఎరగక, "దుర్యోధనా, నీ పరాక్రమం ఎటువంటి దనాలి! ఆ గంధర్వులను జయించి ఇంటికి తిరిగి పోతున్నావా? వాళ్ళు ఉద్దండులు. వాళ్ళకు తట్టుకోలేక నేను వికర్ణుడి రథం మీద పారిపోయి, ఇంతసేపూ ఎక్కడో దాగి ఉండి, ఇప్పుడే వస్తున్నాను. నీ వంటి శూరుడు ప్రపంచంలో మరొకడు ఉండడు," అన్నాడు ఉత్సాహంగా.

కర్ణుడు ఇలా మెచ్చుకునేసరికి దుర్యోధనుడికి దుఃఖం ఆగలేదు. అతను వణుకుతున్న గొంతుతో, జరిగినదంతా కర్ణుడికి చెప్పి, "నేను యుద్ధంలో గెలిచినా కీర్తి వచ్చేది, చచ్చినా వీరస్వర్గం వచ్చేది. రెండూ జరగలేదు. రెంటికీ చెడ్డ రేవడనైనాను. ఈ అవమానం మోసుకుని హస్తినాపురానికి తిరిగి వెళ్ళలేను. నా తండ్రికీ, ద్రోణ కృపాశ్వత్థామలకూ నా మొహం చూపలేను: వాళ్ళతో జరిగినది చెప్పలేను. నా కసలు జీవితం మీద విరక్తి పుట్టింది. చచ్చిపోతాను. నే నిక్కడే ప్రాయోపవేశం చేస్తాను. మీ రందరూ హస్తినాపురానికి

34. కర్ణుడి దిగ్విజయం



వెళ్ళి పొండి. దుశ్శాసనుడికి పట్టం కట్టి, మీ రందరూ ఉండి రాజ్యం ఏలించండి,'' అంటూ తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు. ఇద్దరూ ఏడ్చారు.

కర్ణుడు వారి ఏడుపు చూసి చిరాకు పడుతూ, ''మీ రిద్దరూ దేనికని శోకాలు పెడుతున్నారు? ఏడ్చిన కొద్దీ మరింత ఏడుపే గాని మనశ్శాంతి రాదు. పాండవులు నిన్ను విడిపించారని నువు ఎందుకు కుమిలి పోతున్నావు? నీ పౌరులుగా వారు నీకు సేవ చెయ్యటం వారి ధర్మం. ఇందులో అవమానం ఏమున్నది? చచ్చిపోతానం టావు. ఈ మాట నీ సామంతులకు తెలిస్తే నిన్ను పిరికిపంద కింద జమ కట్టుతారు. పాండవుల కున్నదంతా నువు లాగేస్తే వాళ్ళు ప్రాయోపవేశం చేశారా? ఇలాటి వెర్రి ఆలోచనలు మానుకో,'' అన్నాడు.

వెంటనే శకుని, ''నేను నీకు జూదంలో పాండవుల సర్వస్వమూ గెలిచి పెట్టినది అనుభవించక ప్రాయోపవేశం చేస్తానంటా వేమిటి?'' అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడి చెవికి ఎక్కలేదు. అతను దర్భలు పరుచుకుని, నారబట్టలు కట్టి, ప్రాయోపవేశం చేశాడు.

దేవతలకు ఓడి పాతాళంలో నివాసం ఏర్పరచుకున్న దానవులకు దుర్యోధనుడి ప్రాయోపవేశ దీక్ష తెలిసింది. వారు దుర్యోధనుణ్ణి తమ వద్దకు తెప్పించుకోవటానికి గాను అగ్ని చేసి, అథర్వవేద మంత్రాలు చదువుతూ, పాలతో హోమం చేశారు. అప్పుడు ఆ అగ్ని నుంచి కృత్య అనే శక్తి ఒకతె, ఆవులిస్తూ లేచి వచ్చి, దానవుల ముందు నిలబడి, ''నా వల్ల ఏమి కావాలి?'' అని అడిగింది.

''భూలోకంలో దుర్యోధనుడు ప్రాయోపవేశం చేసి ఉన్నాడు. అతన్ని ఈ పాతాళానికి తీసుకురా,'' అని దానవులు కృత్యతో అన్నారు. కృత్య దుర్యోధనుణ్ణి పాతాళ లోకానికి తెచ్చింది.

దానవులు ఆ రాత్రి అంతా దుర్యోధనుణ్ణి తమ మధ్య ఉంచుకుని, కబుర్లు చెప్పి,

"నీ సామంతులు మహా శూరులు. నువు ఉత్తమ క్షత్రియుడవు. క్షత్రియ ధర్మం విడిచి, ప్రాయోపవేశం చేశావేమిటి? ఇందు వల్ల నీకు ఆత్మహత్య చేసుకున్న పాపం తప్ప ఇంకేమీ లభించదు. సుఖమూ కీర్తీ కూడా దక్కవు. నీ శత్రువులు మాత్రం ఆనందిస్తారు. నిజం చెబుతున్నాము, విను. ఈశ్వరుడి వరం పొంది, వజ్ర సమానమైన నీ శరీరం పైభాగాన్నీ, లోకమాత వరం పొంది, అందమైన నీ శరీరం దిగువ భాగాన్నీ మేమే సృష్టించాం. నువు సాధారణ మానవుడివి కాదు, దేవతామూర్తివి. యుద్ధంలో నీ పక్షాన పోరాడి, నీ శత్రువులను వధించబోయే వారందరూ మా అంశలతో పుట్టినవారే. నీ స్నేహితుడు కర్ణుడు నరకాసురుడి అంశ గలవాడు. అందుచేత నువు విచారించకు," అని అతని మనసుకు ఊరట కలిగించి పంపేశారు. కృత్య అతన్ని తిరిగి భూలోకానికి తెచ్చి, దర్భశయ్య మీద పడుకోబెట్టి అదృశ్యమయింది.

దుర్యోధనుడు నిద్ర లేచి, రాత్రి జరిగినదంతా కల అనుకున్నాడు. దాన్ని గురించి అతను ఎవరికీ చెప్పలేదు.

ఈసారి కర్ణుడు దుర్యోధనుడి మనసు తేలికగానే మార్చగలిగాడు. అతను తన పరివారాన్ని వెంట బెట్టుకుని, వైభవంగా హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.




నిండు సభలో భీష్ముడు దుర్యోధనుడితో, "వద్దంటే వినక, ఘోషయాత్ర వెళ్ళి, పరాభవం పొందావు. ధర్మరాజు నీ మానం కాపాడి, నీ పట్ల ఉదారంగా ప్రవర్తించాడు. కర్ణుడి మాటలు నమ్మి నువు అలాటి వాడితో వైరం పెట్టుకున్నావు. నువు స్నేహితుడనుకునే కర్ణుడు, నిన్ను గంధర్వుల పాల పెట్టి, తాను యుద్ధరంగం నుంచి పారిపోయాడు. ఇప్పటికైనా పాండవులతో స్నేహం చేసుకుని, వంశాన్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడు పకపకా నవ్వి, కర్ణ శకుని దుశ్శాసనులతో సభ నుంచి వెళ్ళిపోయాడు. భీష్ముడి మాటలు కర్ణుడికి తల వంపు కలి



గించాయి. అతను దుర్యోధనుడితో, "రాజా, నాకు సేన ఇయ్యి, భీమార్జున నకులసహదేవులు నలుగురూ కలిసి జయించిన దేశాలన్నిటినీ నే నొక్కణ్ణే జయించి నీ కిస్తాను. అప్పుడు ఈ ముసలి భీష్ముడు నన్నింత తేలికగా చూడడు," అన్నాడు. దుర్యోధనుడు సమ్మతించాడు.

కర్ణుడు సేనతో బయలుదేరి, మొట్ట మొదటగా ద్రుపదుణ్ణే ఓడించి, కప్పం పుచ్చుకున్నాడు. తరవాత అతను ఉత్తరంగా వెళ్ళి, అంగ, వంగ, కళింగ, మగథ, మత్స్య, కోసల మొదలైన దేశాల రాజులను ఓడించి, అందరి వద్దా కప్పాలు పుచ్చుకున్నాడు. తరవాత కర్ణుడు దక్షిణ జైత్రయాత్ర చేసి, చాలా రాజులను ఓడించాడు. కుండిననగర రాజైన రుక్మి లాటి వాళ్ళు కర్ణుడితో యుద్ధం చెయ్యక స్నేహం చేశారు. ఇలా దిగ్విజయం చేసి, ధనంతో కర్ణుడు కొంత కాలానికి హస్తినాపురానికి తిరిగి వచ్చాడు,

దుర్యోధనుడు కర్ణుణ్ణి అభినందించి, "భీష్ముడూ, ద్రోణుడూ, బాహ్లికుడూ మొదలైన వీరులు ఎందరుండి కూడా నువు చేసిన సహాయం నాకు చేయలేకపోయారు. ఈ లోకంలో నీకు సమానులెవరూ లేరు," అన్నాడు.

కర్ణుడు దిగ్విజయం చేశాడు గనక తాను కూడా రాజసూయం చేయాలని బుద్ధి పుట్టింది దుర్యోధనుడికి. అందుకు తగిన ఏర్పాట్లన్నీ చేసి, ఋత్విజులను పిలిచి, తన చేత రాజసూయం చేయించమని అతను వారిని కోరాడు.

కాని ఋత్విజులు అందుకు అభ్యంతరాలు చెబుతూ, "పాండవులను జయించి గాని రాజసూయం చేయటానికి వీలులేదు. అదీగాక, నీ తండ్రి బతికి ఉన్నాడు. ఆయన బతికి ఉండగా నీకు చక్రవర్తి అయే అర్హత లేదు. రాజసూయంతో సమానమైనది వైష్ణవమనే మరొక యజ్ఞం ఉన్నది. కావాలంటే ఆ యజ్ఞం చెయ్యవచ్చు," అన్నారు.

దుర్యోధనుడు ఈ మాట తన తమ్ము లకూ, కర్ణ శకునులకూ చెబితే, వాళ్ళు ఋత్విజులు చెప్పినట్టే చెయ్యమని సలహా ఇచ్చారు. యజ్ఞానికి కావలిసిన ఏర్పాట్లన్నీ జరిగాయి. నగరం వెలపల యజ్ఞశాల నిర్మించారు. ద్వైతవనంలో ఉన్న పాండ వులను యజ్ఞానికి ఆహ్వానించటానికి దుర్యో ధనుడు దూతను పంపాడు.

ధర్మరాజు ఆ దూతతో, "దుర్యోధనుడు యజ్ఞం చెయ్యటం గొప్ప విషయం. మాకు కూడా వచ్చి యజ్ఞం చూడాలనే ఉన్నది గాని, మేమిప్పుడు హస్తినాపురానికి వస్తే మా వనవాస దీక్ష భంగమవుతుంది గనక, మేము రాలేము," అన్నాడు.

ఆ దూతతో భీముడు, "మా అరణ్య వాసమూ, అజ్ఞాతవాసమూ పూర్తి అయాక మా ధర్మరాజు దుర్యోధనుణ్ణీ, అతని తమ్ములనూ బలి పశువులుగా పెట్టి, శస్త్రా లతో గొప్ప యజ్ఞం చెయ్యబోతాడు. ఆ యజ్ఞానికి నేను తప్పక వస్తానని దుర్యో ధనుడితో చెప్పు," అన్నాడు.

దుర్యోధనుడి వైష్ణవయజ్ఞం విజయవం తంగా జరిగి, పూర్తి అయింది. కర్ణుడు దుర్యోధనుణ్ణి అభినందిస్తూ, "వచ్చే యుద్ధంలో నేను పాండవులను చంపి, నీ చేత రాజసూయం చేయిస్తాను, చూస్తూ ఉండు!" అన్నాడు.



అక్కడ పాండవులు ద్వైతవనంలో చాలా కాలం ఉండటంచేత, వారు వేటాడిన కారణంగా మృగాల సంఖ్య బాగా క్షీణించి పోయింది. అందుచేత ధర్మరాజు తన తమ్ములతో సహా తిరిగి కామ్యకవనం చేరాడు. అక్కడ వారు పళ్లూ, కాయలూ, దుంపలూ ఏరి చాలావరకు వాటితోనే పొట్ట పోసుకుంటూ కాలక్షేపం చేశారు.

వాళ్ళ వనవాసం పదకొండేళ్ళు ముగి సింది. ధర్మరాజుకు చాలా బాధగా ఉండేది. తాను జూదం ఆడకుండా ఉంటే తనకూ, తన తమ్ములకూ, ద్రౌపదికీ ఈ దుర్భరమైన కష్టాలు రాకపోను! ముందు రాబోయేది తలుచుకున్నా బాధ



గానే ఉండేది. కర్ణుడు పాండవుల నందరినీ యుద్ధంలో చంపుతానని దుర్యోధనుడికి మాట ఇచ్చాడు. ఇలాటి మనోవేదనలతో ధర్మరాజుకు రాత్రివేళ నిద్ర కూడా పట్టేదికాదు.

పాండవులు కామ్యకవనంలో ఉండగా ఒకసారి వ్యాసుడు వారిని చూడ వచ్చి, వారు కృశించి ఉండటం చూసి బాధపడి, వారికి ఉపశమనం కలిగే మాటలు చెప్పి, పదమూడేళ్ళ నియమమూ పూర్తి కాగానే పాండవులకు తిరిగి రాజ్యప్రాప్తి కలుగుతుందని ధైర్యం చెప్పి, వెళ్ళిపోయాడు.

పాండవులు ఈ విధంగా అరణ్యంలో అలమటిస్తూ ఉండగా, దుర్యోధనుడూ, కర్ణుడూ, శకునీ వారిని ఎలా బాధలకు గురిచేయాలా అని ఆలోచనలు చేస్తూ వచ్చారు.

ఆ సమయంలో దుర్వాసమహాముని, తన పదివేల మంది శిష్యులతో హస్తినాపురానికి వచ్చాడు. దుర్వాసుడు మహా కోపిష్ఠి. ఆయనకు జరిగే ఆతిథ్యంలో ఏమాత్రం లోపం వచ్చినా శపించేస్తాడు. అందుకని దుర్యోధనుడూ, అతని తమ్ములూ ఆ మునికి అత్యంత భక్తి శ్రద్ధలతో సేవలు చేసి, వినయ విధేయతలతో నడుచుకున్నారు.

దుర్యోధనుడికి దుర్వాసుడు అనేక రకాల పరీక్షలు పెట్టాడు.

"రాజా, నాకు ఆకలిగా ఉన్నది. వేగం భోజనం సిద్ధం చేయించు. స్నానం చేసి వస్తాను," అని దుర్వాసుడు వెళ్ళిపోయి, ఎంతకూ వచ్చేవాడు కాడు. ఆలస్యంగా వచ్చి, "ఆకలి లేదు," అనేవాడు.

ఒకసారి అర్ధరాత్రివేళ లేచి, "మా కందరికీ ఆకలిగా ఉన్నది," అనేవాడు దుర్వాసుడు. తీరా అన్నం వడ్డిస్తే ఆకలి లేదనేవాడు. ఒక్కొసారి, "ఛీ, ఇదేం భోజనం!" అని తిట్టి, తినటం మానేసేవాడు.

ఇలా ఎన్ని తిప్పలు పెట్టినా దుర్యోధనుడు ఓర్పుగా అన్నిటినీ సహించి సేవలు చెయ్యటం చూసి దుర్వాసుడు సంతోషించి, "రాజా, నీ పరిచర్యలకు సంతోషించాను. నీకు ఏమి కావాలో కోరు," అన్నాడు.

దుర్వాసుడు శపించనందుకు దుర్యోధనుడు ఎంతగానో సంతోషించి, శకుని కర్ణ దుశ్శాసనులతో సంప్రతించి, దుర్వాసుడితో, "స్వామీ, పరమ ధర్మాత్ముడైన ధర్మరాజు అరణ్యంలో ఉన్నాడు. ఆయన వెంట ఆయన తమ్ములూ, భార్యా, అనేకమంది బ్రాహ్మణులూ ఉన్నారు. ద్రౌపది వారికందరకూ భోజనాలు పెట్టి, తాను తిని, పడుకుని ఉన్న సమయంలో మీరు మీ శిష్యగణంతో సహా అక్కడికి వెళ్ళి ఆతిథ్యం అడగాలి. ఇదే నేను మీనుంచి కోరేవరం," అన్నాడు.

దుర్వాసుడు అందుకు సమ్మతించి, తన శిష్యులతో సహా కామ్యకవనానికి బయలుదేరాడు. దుర్యోధనుడి సంతోషానికి మేర లేదు. "పాండవులు దుర్వాసుడికి ఆగ్రహం తెప్పించి, ఆయన శాపానికి గురి అయి, నాశనమైపోతారు. ఇంత కాలానికి మన కోరిక తీరుతున్నది," అని కర్ణుడు దుర్యోధనుడితో అన్నాడు. శకుని దుశ్శాసనులు సంతోషించారు.

కామ్యకవనంలో ఒకనాడు ద్రౌపది తన భర్తలకూ, బ్రాహ్మణులకూ భోజనం పెట్టి, తాను కూడా తిని, పడుకున్నది. ఆ సమయంలో వారి ఆశ్రమానికి దుర్వాసుడు తన పదివేల శిష్యులతోనూ వచ్చి చేరాడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా దుర్వాసుడికి ఎదురు వెళ్ళి, స్వాగతం చెప్పి, అర్ఘ్యపాద్యాలతో పూజించి, ఆయన పాదాలకు నమస్కరించి, "మహాత్మా, తమరు తమ శిష్యులతో సహా మా ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు.

ఈ మహారణ్యంలో ఉంటున్నవాడు తనకూ, తన శిష్యులు పదివేల మందికీ ఎలా భోజనం పెడతాడా అన్న ఆలోచన కూడా లేకుండా, దుర్వాసుడు ధర్మరాజు ఆతిథ్యం స్వీకరించటానికి ఒప్పుకుని, తన శిష్యులతో సహా స్నానం చేసి రావటానికి గంగానదికి వెళ్ళాడు.

ఇంతమందికి ఎలా భోజనం పెట్టాలో ద్రౌపదికి అర్థం కాలేదు. ఆమెకు ఇంకేదారీ కనిపించక కృష్ణుణ్ణి ధ్యానించింది.






## 11

పార్వతీ కల్యాణానికి వచ్చిన అతిథులంతా వెళ్ళిపోయారు. శివుడు నందీశ్వరుడితో, "నేనూ, పార్వతీ విశ్రమించి బడలిక తీర్చు కుంటాము. మహాసౌధాన్ని అలంకరింప జెయ్యి," అన్నాడు.

నందీశ్వరుడు గణాధిపతులను వెంట బెట్టుకుని మహాసౌధానికి వెళ్ళాడు. ఆ సౌధాన్ని శుభ్రం చేసి, పన్నీటితో కడిగారు. జవ్వాది మొదలైన పరిమళ వస్తువులతోనూ, ముత్యపు పొడితోనూ పద్మాల ముగ్గులు పెట్టారు. పగడాలతో తయారు చేసిన మంచం మీద హంసతూలికా తల్పాన్ని అమర్చారు. గోడలకు చిత్రపటాలు తగిలించారు. పానీయాలూ, తినుబండారాలూ, పువ్వులూ, ఫలాలూ ఉంచవలసిన చోట ఉంచారు. పడకగది ఎంతో అందంగా తయారయింది.

శయ్యాగృహం సిద్ధమయిందని వినగానే శివుడు నందీశ్వరుడు మొదలైన వారితో, "మేము వెళ్ళి పడుకుంటాము. మీరు ఎవరినీ లోపలికి రానివ్వక, భవనం అన్ని పక్కలా కాపలా కాయండి," అని చెప్పి, పార్వతిని చెయ్యి పట్టుకుని శయనించటానికి తీసుకుపోయాడు. వారు దాంపత్య సుఖాలలో మునిగిపోయారు.

ఈ లోపల దేవతలకు తారకాసురుడు పెట్టే కష్టాలు అంత కంతకూ మితిమీరి పోయాయి. వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, "ఓ బ్రహ్మదేవుడా, నీ వరాల మూలంగా మేము నరకబాధలు పడుతున్నాము. తారకాసురుడు చస్తే గాని మాకు సుఖం లేదు," అని మొత్తుకున్నారు.

బ్రహ్మ వారితో, "నేను తారకుడికి అసాధారణమైన వరాలు ఇచ్చిన మాట

---

అట్ట చివరి బొమ్మ



నిజమే. కాని వరాలు ఇవ్వక ఎలా తప్పుతుంది? దుర్మార్గులైనా, సన్మార్గులైనా కూడా వరాలు ఇచ్చి తీరాలి. దుర్మార్గులనే ఉద్దేశంతో వరాలు ఇవ్వటం మానితే వాళ్ళు తపస్సు మానరు. వారి తపస్సు నుంచి పుట్టిన అగ్ని లోకాలను దహిస్తుంది. లోకాలను కాపాడటానికి వరాలిస్తున్నాను. ఆ వరాల సహాయంతో వాళ్ళు లోకాలను పీడిస్తున్నారు. ఆ కారణంగా వారిని చంపే అవసరం కలుగుతున్నది. మనం విష్ణువు వద్దకు వెళ్ళి కష్టాలు చెప్పుకుందాము," అన్నాడు.

అందరూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళి, తారకుడు పెట్టే బాధలను గురించి చెప్పుకున్నారు. విష్ణువు వారితో, "పార్వతీ పరమేశ్వరులు వివాహం చేసుకుని, దాంపత్య జీవితం గడుపుతున్నారు. వారికి కుమారుడు కలగగానే మీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

"శివ పార్వతుల దాంపత్యం ఆరంభమై చాలా కాలమయింది. ఇంకా వారికి కొడుకు పుట్టలేదు. నువు వచ్చి శివుణ్ణి చూసి మా గోడు ఆయనకు చెప్పాలని మా ప్రార్థన," అన్నారు దేవతలు విష్ణువుతో.

విష్ణువు బ్రహ్మాది దేవతలను వెంట బెట్టుకుని కైలాసానికి వచ్చాడు. శివుడి భవనం చుట్టూ నందీశ్వరుడు మొదలైన వాళ్ళు కాపలా ఉన్నారు. విష్ణువు నందీశ్వరుడితో, "మేము శివుణ్ణి చూడ వచ్చాము. మమ్మల్ని లోపలికి వెళ్ళనీ," అన్నాడు.

"శివ పార్వతులు లోపల ఏకాంతంలో ఉన్నారు. ఎవరినీ లోపలికి రానీయ వద్దని శివుడి ఆజ్ఞ. ఆయన ఆజ్ఞ పాలించటం మా విధి. మమ్మల్ని మన్నించాలి," అన్నాడు నందీశ్వరుడు విష్ణువుతో.

వాళ్ళంతా వచ్చిన పనికి విఘ్నం కలిగింది. అందుచేత విష్ణువు దేవతలతో, "పార్థివలింగాన్ని తయారు చేసి, శివ పంచాక్షరి జపిస్తూ పూజిస్తే, శివుడు ప్రసన్నుడై దర్శన మిస్తాడు," అంటూ సలహా ఇచ్చాడు.

దేవతలు మట్టితో పార్థివలింగాన్ని తయారు చేసి, పంచాక్షరీ యుక్తంగా షోడశోపచార పూజలు చేసి, "హరహర మహాదేవ శంభో!" అని గట్టిగా అరిచారు.

స్తోత్ర ప్రియుడైన శివుడు ఇది విని, పార్వతితో శృంగారాలు మాని, ఆమె ఆనందాన్ని భంగపరుస్తూ ద్వారం వద్దకు వచ్చి, "దేవతలారా, నన్ను ఎందుకు ప్రార్థిస్తున్నారు?" అని అడిగాడు.

బ్రహ్మ మొదలైన వాళ్ళు ఆయనతో, "ఈశ్వరా, తారకుణ్ణి చంపటానికి నీ వీర్యాన ఒక కొడుకును సృష్టించు," అన్నారు.

ఈ మాట వినగానే శివుడు తన వీర్యాన్ని అగ్ని గుండంలో విడిచాడు. పార్వతి ఇది చూసి అలిగి, దేవతలకు సంతాన ప్రాప్తి లేకుండా శపించింది.

శివుడి వీర్యాన్ని ధరించిన అగ్ని తాపంతో బాధపడసాగాడు. ఇంతలో సప్తమహర్షులు అగ్నిలో హోమాలు చేసి, పూర్ణాహుతి ఇచ్చారు.

ఆ సమయంలో అగ్ని సప్తమహర్షుల భార్యలను చూసి మోహించి, వారి కోసం విరహం పొందసాగాడు. ఈ విషయం అగ్నిహోత్రుడి భార్య అయిన స్వాహాదేవి తెలుసుకున్నది. ఆమె ఒక్కొక్క ముని భార్య రూపంలోనూ అగ్ని వద్దకు వచ్చి, అతనితో కూడింది. అరుంధతి రూపం



ధరించటం మటుకు ఆమెకు సాధ్యం కాలేదు. ఈ విధంగా స్వాహాదేవి శివుడి వీర్యాన్ని ఆరు భాగాలుగా తన గర్భాన ధరించింది.

ఇందువల్ల స్వాహాదేవికి భరించరాని వేదనకలిగింది. అందుచేత ఆమె ఆ వీర్యాన్ని కైలాసం మీద ఉండే ఒక శిఖరాన విసర్జించింది. వాయుదేవుడు ఆ వీర్యాన్ని గంగలో పడవేశాడు. గంగ దాన్ని ఒక ఒడ్డున ఉండే రెల్లుదుబ్బులలోకి నెట్టింది. అక్కడ ఆ వీర్యం పరిపక్వమై, మార్గశిర షష్ఠి, ధనిష్టా నక్షత్ర మందు, వృశ్చిక లగ్నాన ఒక పిల్లవాడుగా రూపొందింది. ఆ పిల్లవాడికి ఆరు ముఖాలూ,

పన్నెండు చేతులూ, వజ్ర శరీరమూ ఉన్నాయి. ఆ కుర్రవాణ్ణి అగ్నిహోత్రుడి వల్ల ఆరుగురు మునిభార్యలు కన్నారని లోకంలో వాడుక పుట్టింది. అది విని ఆ మహామునులు తమ భార్యలను వెళ్ళ గొట్టటానికి పూనుకున్నారు. స్వాహాదేవి వచ్చి వారితో, "తప్పు నాది. మీ భార్యలు ఏ దోషమూ చెయ్యలేదు," అని చెప్పింది. కాని మునులు వినక, "లోకనిందను ఎలా మాస్పగలం?" అని చెప్పి, తమ భార్య లను వదిలేశారు.

ఆ ముని భార్యలు ఆరుగురూ గంగా తీరానికి వచ్చి ఆరుముఖాల బిడ్డను చూశారు. వెంటనే ఆరుగురికీ పాలు చేపాయి. ఆ పిల్లవాడు ఆరుముఖాలతో ఆరుగురి వద్దా పాలు తాగాడు.

బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి ఆ పిల్ల వాడికి జాతకర్మా, నామకరణమూ చేశాడు. ఆ పిల్లవాడే కుమారస్వామి. అతనికి షణ్ముఖుడనీ, స్కందుడనీ, గుహుడనీ అనేక పేర్లు వచ్చాయి.

మునిపత్నులు అతనితో, "నాయనా, మమ్మల్ని మా భర్తలు వెళ్ళగొట్టారు. మా కేమిటి దిక్కు?" అని అడిగారు.

"నేను మీ కొడుకునే. మీరు నాకు తల్లులు. అందుచేత నా వెంటనే ఉండండి," అన్నాడు కుమారస్వామి.

కుమారస్వామి దినదిన ప్రవర్ధమానుడై, కొండల మీద తిరిగి ఆడుకుంటూ, సింహా లనూ, పులులనూ పట్టుకుంటూ వాటి మీద ఎక్కి సవారీ చేస్తూ వచ్చాడు. అతనికి శివుడి విల్లు దొరికింది. దానితో అతను బాణాలు వేసి, క్రౌంచ పర్వత శిఖరాన్ని ఖండించాడు.

అది చూసి ఆ పర్వతం మీద ఉండే రాక్షసులు కుమారస్వామి మీదికి యుద్ధానికి వచ్చారు. కుమారస్వామి వారినందరినీ చంపేశాడు.

ఈ లోపల శివ పార్వతులకు ఇరవై ఒక్కమంది సంతానం కలిగారు. వారందరూ వేరు వేరు గణాలకు మూలపురుషులై గణపతులయారు.



ప్రపంచపు వింతలు :

# 121. ప్రాచీన గ్రీకు వ్యాయామ క్రీడలు

వ్యాయామ క్రీడలు ఆరంభించినది గ్రీకులే అని చెబుతారు. దిగువ చూపిన ప్రాచీన శిల్పంలో మల్లయుద్ధమూ, కుక్కా పిల్లీ పోట్లాటా, బంతి ఆటా, హాకీ ఆటా చిత్రించి ఉన్నాయి.



Chandamama, December '71

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మేకపిల్ల కలిమి

పంపినవారు:
డి. వి. పద్మ

Chandamama, December '71

Photo by Brahm Dev



ఎస్.ఆర్. పేట,
కర్నూలు

కుక్కపిల్ల చెలిమి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు డిసెంబర్ నెల 10 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఫిబ్రవరి సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:

రిపబ్లిక్ దినోత్సవం - 1

మూడవ అట్ట:

రిపబ్లిక్ దినోత్సవం - 2


**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

వేనకు వేలు
వెన్న ముద్దలు, మాల్టు,
గ్లూకోస్ మీగడ పాలు
కలబో సితిని కలిపి
చేసితిని

# న్యూట్రిన్

లాక్టో
బాన్ బాన్సులోయ్
అదిపేరుమోసిన పిల్లల మిఠాయ్!




పిల్లలు - పిల్లలు - రోజు రోజుకీ
గెంతులు వేస్తూ అదే కోరిరి
న్యూట్రిన్ లాక్టో బాన్ బాన్స్‌కు
మించిన మిఠాయి మరి లేదోయ్!

ఒక్కొక్క మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం. ప్ర.)

NCM-28 TEL


Chiclets
12 PIECES





ఉన్నత
ఆశయాలతో
ఉన్నారా?

వాడండి డీలక్స్ కేమెల్ ఇంక్






Vision 711 Tel

